## నాటకములు

| | | | |
|---|---|---|---|
| సీతాకళ్యాణము | 0 | 12 | 0 |
| రుక్మిణీకళ్యాణము | 0 | 12 | 0 |
| [illegible]సంహారము | 1 | 0 | 0 |
| సురానంద | 1 | 0 | 0 |
| జయంతజయపాలము | 0 | 12 | 0 |
| సావిత్రి | 0 | 12 | 0 |
| మోహినీరుక్మాంగద | 0 | 12 | 0 |
| లోలుగోహారు | 0 | 12 | 0 |
| వరవిక్రయము | 1 | 0 | 0 |
| చింతామణి | 1 | 0 | 0 |
| మధుసేవ | 1 | 0 | 0 |
| సతీసంధర్భ | 0 | 12 | 0 |
| రసపుత్రవిజయము | 0 | 12 | 0 |
| రామదాసునాటకము | 1 | 0 | 0 |
| రాధాకృష్ణలీల | 1 | 0 | 0 |
| పాదుకాపట్టాభిషేకం | 0 | 12 | 0 |
| పాండవఅజ్ఞాతవాసం | 0 | 12 | 0 |
| కనకతార | 0 | 12 | 0 |
| శ్రీకృష్ణతులాభారము | 0 | 12 | 0 |
| పద్మవ్యూహము | 0 | 12 | 0 |
| శ్రీకృష్ణరాయభారము | 0 | 12 | 0 |
| భీష్మప్రతిజ్ఞ | 0 | 12 | 0 |
| శ్రీనివాసకళ్యాణము | 0 | 12 | 0 |
| మాతృదాస్యవిమోచనం | 0 | 12 | 0 |
| సరోజిని | 1 | 0 | 0 |
| అనసూయ | 0 | 12 | 0 |

## నవలలు

| | | | |
|---|---|---|---|
| భయంకరరాక్షసి | 1 | 0 | 0 |
| భయంకరబడాచోరు | 1 | 0 | 0 |
| దొంగరాముడు | 0 | 12 | 0 |
| భయంకరనారీపిశాచి | 1 | 0 | 0 |
| ప్రతాపదాక్షిణ్యము | 0 | 12 | 0 |
| వలపులరాణి | 1 | 0 | 0 |
| శ్రీనాథకవిచరిత్ర | 1 | 0 | |
| తెనాలిరామలింగనిచరిత్ర | 1 | 0 | 0 |
| వేములవాడభీమకవి | 1 | 0 | [illegible] |
| కాళిదాసుచరిత్ర | 1 | 0 | 0 |
| శ్రీకృష్ణదేవరాయల చరిత్ర | 1 | 0 | 0 |
| శ్రీరంగనాధమహాత్మ్యం | 0 | 6 | 0 |
| శ్రీశివానందలహరి | 0 | 4 | 0 |
| [illegible] | 0 | 2 | 0 |
| చిన్నయ్య చరిత్ర | 0 | 8 | 0 |
| దండకరత్నావళి | 0 | 8 | 0 |
| భగవద్గీతాంధ్రకావ్యం | 1 | 0 | 0 |
| అధ్యాత్మరామాయణ కీర్తనలు | 0 | 12 | 0 |
| నోములకథలు | 0 | 10 | 0 |
| [illegible]చరిత్ర | 0 | 10 | 0 |
| కుశలవులయుద్ధము | 0 | 10 | 0 |
| మయూరధ్వజచరిత్ర హరికథ | 0 | 8 | 0 |

వంటెద్దు లక్ష్మయ్య బుక్కు సెల్లరు

రాజమండ్రి గోదావరిజిల్లా

శ్రీరస్తు.

# సీతాకళ్యాణము

(నాటకము.)

అవసరాల శేషగిరిరావుగారిచే రచియింపఁ

SREE

# SITA KALYANAM.

(DRAMA)

BY

Avasarala Seshagiri Rao.

[illegible] స్కూళ్ల ఇన్స్పెక్టరు, బుక్కుసెల్లరు అండు పబ్లిషరు

రాజమండ్రి, గోదావరిజిల్లా.

హోత్రాప్రగడ శేషగిరిరావు పంతులుగారి స్వకీయ

శ్రీసుజనరంజని ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.



(వెల 1కి 0—12—0

# ఈనాటకమునందువచ్చు పాత్రలు.

## పురుషులు.

శరథుఁడు:— అయోధ్యాపురాధీశుఁడు.

ాముఁడు— కథానాయకుఁడు.

క్ష్మణుఁడు
రతుఁడు
త్రుఘ్నుఁడు. } దశరథుని పుత్రులు.

సిష్ఠుఁడు
శ్వామిత్రుఁడు
తముఁడు. } మునులు.

మంతుఁడు.

ంత్రులు.

ందరు రాజపుత్రులు.

నకుఁడు:— మిథిలాదేశపు చక్రవర్తి, సీతజనకుఁడు.

రశురాముఁడు.

## స్త్రీలు.

త:— కథానాయక, శ్రీరాముని ధర్మపత్ని.

సల్య.
మిత్రి.
కేయి } దశరథుని భార్యలు.

హల్య:— గౌతమునిభార్య.

ఇంకను భటులు, చెలికత్తెలు మొదలగువారు సందర్భానుసారముగ వచ్చుచుందురు.

# ప్రకటన

సుప్రసిద్ధఆయుర్వేద వైద్యగ్రంథములు గ్రంథకర్త శ్రీమదఁ
గర తిరుమలమాడభూషి శ్రీనివాసాచార్యులు అయ్యవార్లంగారు
చే రచియింపఁబడిన వైద్యబుక్కులు అయిదున్నూ మాచే శాశ్వ
కాపీరైటుహక్కు పొందఁబడి అచ్చుపడినవి. ఇతర్లు యిమిటేషను
ంథములు వేయుచున్నారు. గ్రంథకర్తగారిఫొటోను, పేరున్నూ
చి మరితీసుకొనుఁడు.

1. ఆయుర్వేదసారసంగ్రహము (లేక) హిందూగృహసం
కి రు 0—12—0 (మూఁడవకూర్పు) యీగ్రంథముప్రతియిం
నుండదగినది. ప్రతిరోగమును స్వయముగా చూచుకొని వైద్యుని
క్క సహాయములేకనే కుదుర్చుకొనవచ్చును.

2. సుఖరోగచికిత్సారత్నాకరము(నాలుగవకూర్పు)అ. 12.
దు అన్నిరకముల సుఖరోగములకు వివరముగా వ్రాయఁబడినది.
పశుద్ధులు వ్రాయడమయినది. 3000 బుక్కులు ఖర్చుపడినవి. దీని
క్క విషయము మేము చెప్పనక్కఱలేదు.

3. శతలేహ్యపాకప్రకాశిక (మూఁడవకూర్పు) 0—12—0
రు లేహ్యములుచేయువిధముఅందరికిదెలియులాగునవ్రాయబడినది.

4 నాడీపరిజ్ఞానము (మూడవకూర్పు) 0—8—0
నాడీనిదానము విపులముగా ప్రతివారికి దెలియులాగున వ్రాయబడి
ది. అతిసులువుగా నాడీ నిదానము తెలియగలదు.

5 పానీయకల్పవల్లి (మూడవకూర్పు) 0—4—0
దు మర్బత్తులుచేయువిధము తెలుపబడినది. యింక నాటకములు,
వలలు, వైద్యగ్రంథములు యితరగ్రంథములు వలయువారు యీ
ంది విలాసమునకు వ్రాయుడు.

వంటెద్దు లక్ష్మయ్య, బుక్కుసెల్లరు,
రాజమండ్రి.

| నాటకములు | | | |
|---|---|---|---|
| సీతాకళ్యాణము | 0 | 12 | 0 |
| రుక్మిణీకళ్యాణము | 0 | 21 | 0 |
| వేణీసంహారము | 1 | 0 | 0 |
| సురానంద | 1 | 0 | 0 |
| జయంతజయపాల | 0 | 12 | 0 |
| సావిత్రి | 0 | 12 | 0 |
| మోహినీరుక్మాంగద | 0 | 12 | 0 |
| లోలుగోహారు | 0 | 12 | 0 |
| చింతామణి | 1 | 0 | 0 |
| సతీసదర్బా | 0 | 12 | 0 |
| రామదాసునాటకం | 1 | 0 | 0 |
| రాధాకృష్ణలీల | 1 | 0 | 0 |
| పాండవఅజ్ఞాతవాసం | 0 | 12 | 0 |
| శ్రీకృష్ణతులాభారం | 0 | 12 | 0 |
| శ్రీకృష్ణరాయభారం | 0 | 12 | 0 |
| భీష్మప్రతిజ్ఞ | 0 | 12 | 0 |
| శ్రీనివాసకళ్యాణము | 0 | 12 | 0 |
| సరోజని | 1 | 0 | 0 |
| అనసూయ | 0 | 12 | 0 |
| మాతృదాస్యవిమోచనం | 0 | 12 | 0 |

| నవలలు | | | |
|---|---|---|---|
| భయంకరరాక్షసి | 1 | 0 | 0 |
| భయంకరబడాచోరు | 1 | 0 | 0 |
| దొంగరాముడు | 0 | 12 | 0 |
| భయంకరనారీపిశాచి | 1 | 0 | 0 |
| ప్రితాపదాక్షన్యము | 0 | 12 | 0 |
| వలపులరాణి | 1 | 0 | 0 |
| శ్రీనాధకవిచరిత్ర | 1 | 0 | 0 |
| వరవిక్రయము | 1 | 0 | 0 |
| మధుసేవ | 1 | 0 | 0 |
| రసపుత్రవిజయము | 0 | 12 | 0 |
| శ్రీజగన్నాధమహాత్మ్యం | 0 | 6 | 0 |
| పాదుకాపట్టాభిషేకం | 0 | 12 | 0 |
| కనకతార | 0 | 12 | 0 |
| పద్మవ్యూహము | 0 | 12 | 0 |
| అధ్యాత్మరామాయణకీర్తనలు | 0 | 12 | 0 |
| నోములకథలు | 0 | 10 | 0 |
| కుచ్చెలచరిత్ర | 0 | 10 | 0 |
| కుశలవులయుద్ధము | 0 | 10 | 0 |

వంటెద్దు లత్సయ్య, బుక్కుసెల్లరు,

రాజమండ్రి, గోదావరిజిల్లా.




# సీతాకల్యాణము

## ప్రథమాంకము.

### నాంది.

శ్రీరాముండననీ భువిన్ జనసమై సేవింప మౌనీశుఁడున్
పోరాటంబునఁ బెక్కుగాథలనగా పొందించుమస్త్రావళిన్
వీరాలాపములెల్లఁ బోవిడువఁ దా వీక్షించియుం గాఁడెనా
నీరేజాక్షుఁడు ప్రేమఁ గాత మెప్పుడున్ నిండార నీసత్కృపన్.

ప్రవేశము:—అయోధ్యాపురమందలి రాజసభామంటపము

ప్రవేశము:—దశరథుఁడు, వసిష్ఠుఁడు, సుమంత్రుఁడు, మంత్రులు

దశ—(వసిష్ఠుని నుద్దేశించి)

గురువరేణ్యా! నాముద్దుతనయులు, తే భాగ్యపుపంటైనను భవదీయకటాక్షంబున, సకలవిద్యాపారంగతులై, పెక్కువిధములఁ దలిదండ్రులనేగాక, చూపరులనెల్ల నానందవార్ధి నోలలాడించుచున్నారు. ఆరాముని నగుమోము నొక్కక్షణకాలమైనఁ దిలకించక, మనియుండఁజాలనుకదా! శుక్లపక్షపు చంద్రునికైవడి దినదిన ప్రవర్ధమానులగుచు గనులకు సంతసమునఁగొల్పు నిట్టిసుతులనుబడయుటకు,

గీ. ఏమినోములు నోచితో యెట్టి పుణ్య
కార్యములను జేయగనిట్టి ఘనులనేఁడు

సుతులుగనుబడ యనయ్యెనుజూడఁజూడ
నన్నుఁబోలెడు ధన్యులు నెన్నఁగలరె.

వ—(తనలో) ఈరాజేంద్రుఁడు, తనసుతు లవతారపురుషులని తెలి యఁజాలక యున్నవాఁడు. మునుముందు వారిశౌర్యపరాక్రమములు వెల్లడియగువేళనైనఁ దెలిసికొనఁ గల్గును. (ప్రకాశముగా) రాజా! నీపుత్రులవతార పురుషులవలెఁ బ్రకాశించుచున్నవారలు.

ద—మహాత్మా! నేఁడేటికో నామనంబించుక విచారమునఁ దగుల్కొని కుందఁజొచ్చెను. ఇందులకుఁ గత-మేమై యుండునో?

వ—రాజా! నీమనోవాంఛ లన్నియు నెఱవేరి, సంతుష్టాంతరంగుండవై యుండెడునీకాలమున నీకు విచారముఁగొల్ప నెట్టి హేతువును గానరాదు. రాచకార్యములన్నైమెనఁ గొఱంతలుకలవా?

ద—అట్టివేమియు నున్నట్లుతోఁచదు. (మంత్రులవైపుఁ దిరిగి) మంత్రిశేఖరులారా! రాజ్యమం దెచ్చట నల్లకల్లోలము లేమియును లేక ప్రజలుసుఖంబుల నలరారుచున్న వారలే?

మంత్రి—రాజేంద్ర! ఎల్లరును మనోభీష్టముల నెరవేర్చుకొనుచు న్యాయమార్గానువర్తనులై సంతసమున నెగడుచున్నవారలు.

(ప్రవేశము — ఒకసేవకుడు)

సే—మహారాజా! విశ్వామిత్రమహాముని యేతెంచియున్నారు.

ద—(మంత్రులు మొదలగువారిఁ గూడి యెదురేగి యర్ఘ్యపాద్యంబులనొసంగి తోడ్కొనివచ్చి యుచితాసనాసీనునిగనొనర్చును)

వి—దశరథా!

గీ. కుశలమే రాజ యెల్లనుఁ గోర్కెలెల్లఁ
దీఱుచుండెనే నీకెట్టికొఱఁతలేక

న్యాయమార్గానుసారిణి హేయమేమి
చూపకుండుటే యొప్పగు నృపులకెల్ల.

ద—శక్తివంచనలేక ప్రజలఁ గన్నబిడ్డలభాతి గాంచుచు మసలుచున్నవాఁడ. మీయట్టి మహామునీంద్రుల యాశీర్వాదంబులు నిరర్థకంబులగునా?

సీ. ధన్యుఁడనుకాని భవదీయ దర్శనంబు
ప్రాప్తమయ్యెను మానీఁదప్ర పాపమణగె
వలయుఁ గోర్కెలివియెకాదె వాంఛఁదీరఁ
గాంచుభాగ్యంబు చేకూరె గాధిపుత్ర.

తమ్ముఁబోలు మహాత్ము లూరక దర్శనం బొసంగుదురా?

వి—రాజా! నీయొక్క సద్గుణపరంపరలే యందులకుఁ గారణభూతములు.

ద—ఎంతయు ధన్యుఁడను.

వి—పృథ్వీశా! నేనొక కార్యార్థమే తెంచితిని.

ద—భవదీయయాజ్ఞల కెదురుత్తర మీయఁజాలువాఁడనే. తమ కోర్కె యెట్టిదైనను శిరసావహించి తత్క్షణమే యొనర్చువాఁడను. సత్వరంబుగ సెలవిండు.

వి—నీవట్టి యుదారశీలుఁడ వని యే తెంచితిని. కాని, వెనుఁదీయ సాహసించెదవేమోయని యొండుశంక వొడముచున్నయది.

ద—మహాత్మా! అట్లెన్నఁడును దలంపకుఁడు.

క. జగములు తలక్రిందైనను
ఖగవాహనుఁ డడ్డువడినఁ గల్లలు చెప్పన్
పగవారైనను శరణనఁ
దగురీతిని గాంతునెపుడు ధన్యతనొందన్.

వి—అట్లైనఁ దెల్పెదను వినుము.

గీ. యాగమొకదాని దలపెట్టి యనఘ! నీదు
సాయమునుగోరి యే నిందుఁ జనఁగవలసె
నిరుపమాన కరుణఁజూపి నెగడుటొప్పు
నాదుకోర్కెను నెఱవేర్పు న్యాయశీల.

ధ—గాధినందనా! నిరంతరమా నీరజాక్షుని పాదసేవా ధురంధరులగు మీకేటికోర్కెలు? వాటిని గొనసాగింప నేనెంతవాఁడను. సదయహృదయులై యీగోప్యము మాయందుంచనెంచి యిట్లే తెంచియుండనోపు ఆజ్ఞకుబద్ధుఁడను సత్వరంబున వెలిఁబుచ్చి నన్ను సంతుష్టాంతరంగునిగ నొనర్పఁ బ్రార్థించుచున్నాఁడను

వి—(తనలో) ఈరాజేంద్రుఁడు, నాకుధన మేమైనఁగావలయునేమో యని తలఁచియుండనోపు. తుదకుఁ బుత్రులయందుండెడు వాత్సల్యముచే వెనుఁదీయుకదా అన్నతమెట్లాడును?
(ప్రకాశముగా) దశరథరాజవర్యా!

ఉ. రక్కసులెందఱోయటవి రాల్చుచునగ్నికణంబులల్ సదా
యుక్కడగింతుమంచుమము నూరటనందకయుండునట్లుతా
రక్కటవేచుచుండిరెటు·యార్తినిదీర్తువొ రాజమమ్ము నె
న్నక్కువనాదరింపుమిఁక మానసభీతిని బాఱఁద్రోలుమా.

ద—(క్రోధముతో) ఏమేమి? నిరపరాధులై, దండకారణ్యములఁ గందమూలఫలము లాహారముగఁ గైకొనివర్తించు, మీకే యెగ్గొనరింపఁబూనియుండిరా?

గీ. హోమములఁజేయువేళను నుగ్రులయ్యు
రక్తమాంసములను దెచ్చి వ్యక్తిలేక
యగ్నికుండములందున నక్కటకట
పోయుచున్నారుగతియేమి పుడమినాథ.

ద—అయ్యో! ఎట్టియకార్యము లాచరించుచుంటిరి. భక్తపరాధీనుం డగు నాపరమేశ్వరుఁ డేరీతిసహించి యూరకుండెనో? అయిన నిఁకఁ జేయవలయున దేమి?

వి—నిర్వక్రమపరాక్రమశీలుండును, నిఖలధారుణీవలయమునఁ బ్రసిద్ధపురుషుఁడును. నవమన్మథాకారుండును, పరోపకారపారీణుండును, నీముద్దులతనయుండునగు నారఘువీరు నొకమాఱు నాతో నడవికిఁబనిపిన, నాతఁడాదుష్టరక్కసులనెల్ల దునుమాడి మాయాగములు నిర్విఘ్నముగఁ గొనసాగించి, మమ్ముల సంతోషంబునబుచ్చును.

ద—(నిశ్చేష్టుఁడై వేఁటకానిజూచి భీతినొందుఁగురంగంబుకైవడిపరితపింపఁదొడఁగును.)

వి—ఏమి? రాజా! ఇట్లునిరుత్తరుఁడవై తత్తరమునొందుచున్నావు! నీమదిఁగల శంకలేమియొ తెల్పుము.

ద—(నిట్టూర్పులఁబుచ్చును.)

వి—దశరథా! పలుకకుంటివేమి?

ద—(భయముతో) మహాత్మా! గాధినందనా!

సీ. అనఘ! నేఁబూర్వము ననపత్యుఁ డననగఁ
జింతచేసొక్కుచు సిగ్గునంది
కుందుచుండగనట్టి కొఱ్ఱయునెఱవేరి
పడయఁగల్గితినాదు భాగ్యమెంతో!
విడనాడనోపను వీక్షింపకుండగఁ
దనయునిక్షణమైన ధన్యచరిత
చిఱుతప్రాయమువాఁడె చేరివింధ్యాటవిన్
వధియింపనెట్టుల వశముచెపుము

గీ. దండకారణ్యమఱసితాఁ దాల్మినొందఁ
జాలునే రీతిబాలుఁడు సైపుమయ్య
చేతులను మోడ్చిమ్రొక్కెదఁ జంతఁబుచ్చ
నేటికోనంయుమీఁదని నేనెట్లువిడుతు.

వి—ఆహా! ఎంతటి జేలవు?

గీ. బుడుతఁడాతఁడుచూపుల భూరియశుఁడు
రాక్షసావళిదునుమాడ రాముఁడనయ
నవనిఁబుట్టినయట్టియా యాదిదేవుఁ
డ్గునుశంకలఁబొగలక యతనిఁబంపు.

ద—సీ. కన్నులనైనను గాంచియెఱుంగని
బాలుఁడెట్టులవారి బలమునణచు
ఉద్యానవనముల నోర్పుమైవిహరించు
సుకుమారుఁడే రీతిఁ జొచ్చునటవి
పరివారితోఁ బోర సాహసింపనివాఁడు
సమరంబుననుయెట్లు సైపఁజాలు
తోడివారలఁగూడి యాడుచునాటలఁ
జరియించుఁగుర్రిడు చనగనగునె

గీ. కదనమున కంపికొామరుని గఠినమూని
యిందువసియింపశక్యమె యెట్టులోర్తు
మునికులోత్తమన్యాయమే మోసగింపఁ
గరుణఁజూడుముయార్యరో కావుమయ్య.

ఓమహేంద్రా! నాముద్దులతనయుని, నాబహిఃప్రాణమును, నారాముని విడనాడి మనియుండ నోపుదునా? ఆపాపఁ డాదుష్టరక్కసులనెదుటఁబడిన నిఁకఁదిరిగివచ్చుట కల్లయేకదా! అయ్యో!

మహిమచే, నన్నే కాక. నాకులమునంతయు నాశనమొందింప గలఁడు. ఎంతయు సంకటమయ్యె. ఎవ్వరితో మొఱలిడుదును. హా! విధాతా! లేకలేక చిరకాలమునకుఁ బుత్రులఁగని మనోభీష్టము నెరవేఱెనుగా యని సంతసించుచుండ, దిరుగ నీరీతి నెడబాటుఁగావించి దుఃఖాబుధిని ముంపనెంచితివా? తొల్లి నే నొనర్చినఁ బాపమేమి? అంతటి కాఠిన్యమునుబూన నేనీయెడ నాచరించిన యెగ్గేమి? (రాముని నుద్దేశించి) హా! రామా! ఈ దురాత్ముని గర్భమున నేలజనించితివి. నాయనా! చేతులారఁ, గన్నబుత్రిని బ్రాణములఁ గొనిపోయి, యానిశాచరుల కర్పించవలసినఁ బాతకుఁడనై చరించవలసినఁ జెడుకాలమాసన్నమగుచున్నది. పుత్రికా! ఆరాక్షసుల కెదురుగనిలిచి భీతినొందువేళ నిట్టికౄరుఁడగు జనకుని, కేలజన్మించితివని, నన్నెంతగ దూలనాడుదువో గదా! రామచంద్రా! నిన్నుపీడ నాయశువులు మేననిల్చునా?

సీ. పరుల కెన్నఁడు నెగ్గు భావించి యెఱుఁగను
కలుగనిట్టి వ్యథ కతమదేమొ
పరబాలురనుగాంచి భావింప నిచ్చతోఁ
జూచుచుందునె కాని చూడనీర్ష్య
భక్తితో నిరతము భజయింతు భగవాను
మఱచి యెఱుంగనే మానసమున
ఎట్టిభోగములున్న నెట్టివైభవమున్న
నణగియుండుటె కాని యప్రమత్తుఁ
గీ. డనగ నపవాదఁడలఁదాల్చి మనగలేదు.
ననపరాధుల దండింపఁ జనఁగలేదు. .

అట్టి నేఁడిట్టి కలుషంబు యూవహింపఁ
దొల్లిఁ జేసినఁ దప్పేమొ తోఁచదకట॥

వి—రాజా! ఆరామునియందుండెడు ప్రేమాతిరేకంబున, నితరము లన్నియు మఱచి, కుందుచున్నవాఁడవే కాని, యాతనిధైర్య సాహసముల తెలియఁ జాలకుంటివి. ఆతనికిఁ బ్రాణహాని సంభవించునట్టి కార్యము లాచరింప మేము మాత్ర మెట్లు సమ్మతింతుము. కావున, నీ వొకఁ గలఁతలవీడి, యుత్సాహపూరితుఁడవై. ఇప్పుడు ఆరాముని ప్రాణములకు నాప్రాణములన్ను వేయుదునే కాని, విడచి యూరకుందునా?

ద—(తలవంచి యూరకుండును.)

వి—నిరుత్తరమంగీకారసూచక మేకదా.

ద— గీ. కరములను మోడ్చి ప్రార్థింతుఁ గనికరమునఁ
బ్రోవవేమమ్ము మహానీతి పూతచరిత
ప్రాణములనైన విడుతునే పాయనోపఁ
గన్నఁ బుత్రుని నేమైనఁ గఠినమూని.

వి—(కోపభావము నభినయించుచు) ఏమేమి! పనుపఁ జాలవా? అట్లనఁ దొలుత నేల ప్రగల్భములఁ బల్కితివి? అనృతమాడఁజూచుచుంటివా? నిష్కళంకమగు క్షత్రియ కులమున కపఖ్యాతిని గలుగఁజేసిన వాఁడవని వన్నెకెక్కఁ దలఁచితివి కాబోలును!

గీ. నీతి మాలినవాఁడవై నిందఁజిక్కి
ఘనతనొందంగ నెంచితొఁ గాకనన్నుఁ
జుల్కనగఁజేసి యీ రీతిఁ బల్కినావొ?
చూడుమహిమంబుఁ జూపెదఁ జోద్యమయ్యె.

ద—(విశ్వామిత్రుని పాదములమీఁదఁ బొఱఁగి విచారముతో)

వ—నీవు త్వరితముగ నేగి, రాజాజ్ఞ నెఱింగించి శ్రీరామునొకమారు తోడ్కొనిరమ్ము.

నే—చిత్తము. (అనినిష్క్రమించును.)

వి—దశరథా! గురువగు వసిష్ఠుఁడు చెప్పిననేకాని, సమ్మతించవైచితివి గదా?

ద—మౌనీంద్రా! మూఢత్వమునఁ బరితాపమునఁబడి క్రుమ్ముచుండుటచే నేమియుఁ జెవిసోకకుండెను. ఆతని మీబిడ్డగనేయెంచి, యేకీడునుమూడకుండఁ గాపాడఁ బ్రార్థించు చున్నాఁడను. ఎన్నఁడును సౌధమునువీడియెఱుఁగని పసిపాపనేరీతి నావనములఁ గాచెదరో. ఆతఁడే లేకున్న, నాకీభువి నన్నియు శూన్యములై కన్పట్టును. ఆతనితోడిదే నాకీలోకము, నాకీజీవనము. ఎంతటిధైర్యశాలియైనను జిఱుతప్రాయమువాఁడుకదా! మరలనాతనిఁ గనులఁ గాంచునందాక నాకును, కౌసల్యకును, నాతనిసోదరులాదిమిత్రజన బృందమునకును నిద్రాహారములేకఱవగును. ఇంతననేల? జీవచ్ఛవంబులమై వర్తింపవలసి వచ్చును.

వి—ఏమియు విచారింపనగత్యములేదు. ఎప్పటియట్టులఁ దోడ్కొని వచ్చి యప్పగించెదను.

(ప్రవేశము:— రామలక్ష్మణులు.)

రా. ల—(వసిష్ఠ, విశ్వామిత్ర ఋషులకును, జనకునకును నమస్కారమాచరింతురు.)

ద—(దగ్గరకుఁ జేరఁదీసికొని ముద్దాడును)

రా—జనకా! మీమోమునుజూడ నేఁడేమియో క్రొత్తగఁ దోచుచుండె. కతంబేమియో తెలుపఁబ్రార్థించుచున్నాఁడను.

ద—తనయా! ఏమని తెలుపుదును. ఈగాధినందనుఁ డిందువిచ్చేసి, రక్కసులబాధ లెక్కువైయుండెననియు, వారిని దునుమాడ

నటవికి నిన్నుఁ బంపుమనియు నానతిచ్చియున్నారు.

రా—(సంతసముతో) నాయనా! ఇందులకింతగ సంకోచింపనేల? సత్వ రంబుగ నాజ్ఞ నొనఁగుడు.

గీ. పోయియడవికి దునిమెద భూమిపాల
దుష్ట రాక్షసావళిదుంచి కష్టములను
బాపి మునులకానందము పఱగఁజేతు
పసుపుమూర్త్యరో కాలయాపనము దేల?

వి—పురుషసింహ మెన్నఁడైన వెనుదీయునా?

ద—నాయనా! రామా!

గీ. వయసుఁజూడగఁ జిన్నవు పల్కులెంతొ
ధైర్యమును గొల్పుచుండెను దానవులను
నెట్లుపరిమార్చఁజాలుదో యించుకైన
వెఱపు లేదయ్య పుత్రికా వింతకాదె.

రా—తండ్రీ! అసమర్థుల మైనప్పుడుకదా భీతికల్గుట.

ఉ. భీతిలనేలనయ్య కడు భీకరమై రిపువర్గమెల్ల నేఁ
జేతునుగూలగన్ బుడమిఁ జేరగఁబోయెద నిప్పుడేనటన్
పాతక మించుకేనియును భావనసేయక క్రూరులై సదా
భూతలమందునిల్చి యెటు పోరగఁజూచిరొ దుష్టదానవుల్.

ద—(తనలో) ఆహా! ఏమి యీతనిపౌరుషము? ధైర్యము? సాహస ము? ఎంతయు వింతఁ గొల్పుచుండె.

రా—ఇంకను సంశయించెదవేల?

ద—తనయా! ఈవేరీతి నారక్కసులమాయలను జక్కగ, జయింపఁ జాలుదువో యనియెదుసంశయమే మనము నభయమును గొ ల్పుచున్నయది. ఎంతటిధీరులైనను, యెట్టి శౌర్యపరాక్రమ ములున్నను, మానవులు వారిఁగెల్చుట దుర్లభము ఎన్నఁడిలువీడి

మెఱుంగని బాలుఁడ వీవెట్లా దారుణారణ్యంబులఁ జొచ్చి సమరమునకుఁదలపడఁ గల్గుదువు! ఎన్నివిధములఁ బ్రార్థించిన నీవిశ్వామిత్రమౌని చెవినిడక, నిర్బంధించుచుండెను. ఏమైనను నామహాత్ముని దే భారము. కుమారా! నీవు తిరుగని లు సేయునందాక, నాప్రాణములు నీయందే నిల్చియుండును. ఈమునికులతిలకుని కోర్కెల నిర్విఘ్నముగా సాగించి, జయము గైకొని శీఘ్రముగఁ దిరిగిరమ్ము.

రా—చిత్తము.

ల—జనకా! సోదరునివెంట నేనుగూడ నేగి, సహాయ మొనర్తును. నాయందఁదరక్షుగై యాజ్ఞనొసంగుడు.

ద—మంచిది పోయిరమ్ము. (విశ్వామిత్రునిగాంచి) ఋషిపుంగవా! యీరామలక్ష్మణులు మీబిడ్డలు. వీరిరువురఁ గొంపోయి, తిరుగఁ ద్వరితంబునఁ దోడ్కొని రా బ్రార్థించుచున్నాడను.

వి—నిర్విచారముగనుండుము. శుభ మొనఁగూడునుగాక.

ద—మహాప్రసాదము.

వి—రామా! లక్ష్మణా! రండుపోయివత్తము

రా॥ ల—చిత్తము.

(అని గురువునకును, జనకునకు వందనములాచరించి,
సెలవుఁగైకొని విశ్వామిత్రునితోఁ గలిసి
నిష్క్రమింతురు.)

ద—గురువరేణ్యా! పోవుదమా?

వ—మంచిది. (అందఱు నిష్క్రమింతురు)

(తెరపడును.)

---

# సీతాకల్యాణము

## ద్వితీయాంకము.

### సరయూనదీతీరము.

ప్రవేశము—విశ్వామిత్రుఁడు, రామలక్ష్మణులు.

వి—రామచంద్రా! చూచితివా? ఈ ప్రదేశమెంత రమణీయంబై యొప్పుచున్నదో!

గీ॥ ఇదియె సరయునదియనంగ నింపుఁజూడు
నిర్మలోదకాపూర్ణయై నెగడుచుండి
కనులకెంతయొ యానంద కరముగాఁగ
పాఱుచుండెను జలమతి పాటవముగ.

రాఘవా! ఎన్నిదినములు రత్నమయ సౌధంబుల నివాసంబుగ నున్నను, ప్రాపంచిక వైచిత్ర్యముఁగానశక్యమగునా?

గీ. పయనమునుజేసి వెనుకను బడలియుండు
వేళనిచ్చోట కేతెంచి విడిసియున్నఁ
జల్లనగుఁ బిల్లవాయువు లుల్లమందు
నహహా యనునట్లు సంతస మందఁజేయు

అంతియేకాని, యించుకయుఁ గష్టమును దెలియనేరక, పరిచారికు లెందరెన్ని యుపచారముల చేయుచున్నను, సుఖము జనిం చునా?

రా—మహాత్మా! నిక్కము. నిక్కము.

తమ్ముఁడా! లక్ష్మణా!

గీ. అల్లవే యిసుకతిన్నెలు కల్లలగునె
మానిపల్కులు సంతస మసగనిదియె

యిట్టిచోటుల నెంతగ నెన్నుచున్నఁ
దనివి దీఱునెవింతలఁ దఱచిచూడ

అందువలననే, మహాసిందుప్రిలనంత సుఖదాయకంబగు నిట్టి నిర్మల నదీ ప్రాంతముల నివాసం బేర్పఱచుకుని, నిశ్చల బుద్ధి నా భగవానుని సేవఁ జేయఁదొడఁగుదురు. నేఁడీ ఋషిపుంగవుని కరుణా కటాక్షంబున మన మిట్టి సృష్టివైచిత్ర్యములఁ గను లారఁ గాంచు భాగ్యము లభించెను.

ల—తొలుత జనకుఁడు, మనయందుండెడు ప్రేమాతిరేకంబున నెందఱెన్ని తెరంగులఁ జెప్పినను, బనుపుటకు వెనుదీసి యుండెనట.

రా—సహజమేకదా. నిరపరాధులును, శాత్రవులకైన నపకార మొన్నని సద్గుణాలంకారులు నగు నీ మహార్షుల బాధింప నా రక్కసులేల సమకట్టిరో?

వి—దుష్టప్రవర్తనయే కోర్కెయగువారికి, నపరాధులైనను, యనప రాధులైన నొక్కటియే. కాకున్న నంత్యకాల మేరీతిఁ బ్రాప్తించును?

రా—ఓ మునికుల తిలకమా! మాయందుండెడు వాత్సల్యమును జూప నీరీతి మాచే నానిశాచరుల నుక్కడింపఁ దలపెట్టితిరి కాని, మీఁబోలు మునుల కాగ్రహముద్భవించిన ముల్లో కంబు లొక్కమాఱుగ భస్మీభూతంబులు కాకయుండునా?

వి—రాఘవా! ఎవరిచేనంత మొందవలయునని బ్రహ్మలిఖించి యుండెనో, యా విధిజరుగక వేఱొండురీతి నెట్లగును?

రా—చిత్తము! ఇప్పుడు మిము బాధించురక్కసుల నామము లొక్కమాఱు పేర్కొన వేడుచున్నాను.

వి—తాటకియను రక్కసియు, మారీచసుబాహులను రక్కసులును, మహాబలసంపన్నులై, కనులఁగానక, యొడలు మైమఱచి, యనేకరీతుల బాధింపఁ జొచ్చిరి. వారి దుండగముల నేమని చెప్పవాఁడ. కనులఁ గాంచిన నీకే తెలియఁగలదు. వారల చరిత్రలు పిమ్మటఁ దెల్పెదను. ముందుగ నిచ్చోట మన మొనర్పవలసినఁ గార్యమొకటి కలదు.

రా—ఆర్యా! ఏమది?

వి—ఏలాతిబల లను రెండస్త్రములు కలవు. వాటిని నీ కొసంగవలయునని యుద్దేశించినాఁడ. వాటి మహిమంబు నెఱింగించెద వినుము.

సీ. ఎవ్వేళఁదగనట్టి యిక్కట్టులుకూడునో
స్మరియింపు మిదియె సచ్చరిత్ర
కాపాడుఁ బోద్రోలి కల్లగాదయొ రామ
నిద్రించుసమయాన నీచులఱసి
ఆపదలొసఁగూర్పఁ నాసఁజేసిన నైనఁ
బేర్కొనినంతనే భీతితొలఁగు
రక్కసు లెదుఱుగ రానేర్వరెన్నఁడు
పఠియింపదీనిని భవ్యచరిత
గీ. కొనుము యీ మంత్రరాజంబుఁ గోర్కెఁదీర
నీవేయఖండవిందుల నెగడుటొప్ప
కాలయాపన మేలను కమలనయన
చేరి గ్రహియింపుమో రామ చింతలేదు.

రా—మహాప్రసాదము. లక్ష్మణా! ఈ మౌనీంద్రుని కృపారసమనంతముకదా. ఏమి నా భాగ్యము.

వి—రామా! ఇదియుపదేశమైతివేని యెట్టి ధీబలసైన నొక్కక్షణమున నుక్కాడఁగలవు. నిస్సంశయము నిశాచరుల నెల్ల దునుమాడ నిది యెంతయు సహకారిగనుండును. స్నానాది కృత్యములఁదీర్చి, శుచివై సిద్ధమగుము.

రా—చిత్తము.

(అని స్నానసంధ్యాది కృత్యముల నెఱవేర్చి రాగా మంత్రములనుపదేశించును.)

రా—(ముని పాదములకు నమస్కరించి)

గీ. ఘనవ్రతిన్ బొందియుంటివి తాపసేంద్ర
మెట్టినోములు నోచితో యిట్టికృపకుఁ
బాత్రుఁడనగనుజాలితి భక్తి చేతఁ
గొలుచుచుండెద మౌనీంద్ర కూర్మి మిగుల

వి—రాఘవా! నేఁటి రాత్రి కడ్డచోటనే విశ్రమించి రేపటి యుదయముననే బయలు వెడలి, జాహ్నవిని దాటి, యరణ్య మార్గంబులఁ జొచ్చుట యుచితము.

(నిష్క్రమించును.)

---

ద్వితీయరంగము.

---

అరణ్యసీమయందు, విశ్వామిత్రుని యాశ్రమము

ప్రవేశము:—రామలక్ష్మణ సమేతుండై కౌశికుఁడు.

వి—రామా!

ఉ. చేరితిమియ్యెడన్ యిఁకను సేదను దీర్చుకొనుండు మీరలీ
చేరువనున్న నిక్కముగఁ జేరఁగఁ జూతురు రక్కసుల్ యిటన్

కారులు చ్ఛేరిలినంతఁదగఁ గానరమంతయుఁ దూలఁజేయుమీ
యొరఘురామ దీనులను నోర్పుతోఁ గాచుటయేతగున్ సదా.

రా—ఆర్యా! ఈయాశ్రమంబెవ్వరిది?

వి—నాయదియే.

రా—ఎంత యుధన్యులమైతిమి.

గీ. చూడఁ జూడనింపెసఁగెయు సొబగుఁదోచుఁ
గనులపండువయై యొప్పెఁ గాననంబు
కాదువింతలుఁ గొల్చెను కరుణచిత్తు
లైన మునులకావాసమై యలరునిదియు

ఇట్టి పుణ్యస్థలంబులఁ దిలకించుభాగ్యమే భాగ్యము. మీ యట్టి మహామునుల దర్శనమాచరించి కొల్చుచుండుటకన్న నా రాజ్యసుఖము లెక్కఁడగునా? భుక్తిముక్తి ప్రదాయక మిదియేకదా

(తెరలో)

మ. ఇదిగో సందువ, జూడనయ్యె నటులన్ యేనేగి పోరాటమున్
మదినుత్సాహము కల్గఁదెచ్చియును నామాయన్ యసిఁ జల్చినా
కదియేయెన్నగి హాసహా వెదుకఁగ నాలస్యమే లేదుపో
యెదఁ గూర్మిన భుజించి యాకలినినే నీవేళఁ దీఱన్ వెసన్

వి—రామా! వింటివా? ఆరోషపూరితంబులగు వాక్యంబులు

రా—ఎవ్వరో! రక్కసియై యుండనోపును.

వి—అదిగో చూడుము

గీ. అదియె తాటకిఁ గాంచుము యనఘమిమ్ము
నజసి మ్రింగగనుంకింప నఱుగుదెంచె
దీనిఁదెగటార్చి పంతలఁ దీర్పుమయ్య
శంకలేలను రాఘవా సచ్చరిత్ర

రా—(ఏమియుఁబలుకక యూరకుండును.)

వి—రామచంద్రా! కాలయాపన మేలచేసెదవు? ప్రమాదము సంభ
వించును తడవుసేయుట పాడి కాదు.

రా—ఋషిపుంగవా! నాకొక సంశయ మొదవినది.

వి—ఏమది?

రా—ఆ॥వె॥ వనిత కాదె? యెట్లు వధియింపఁదగునయ్య?
పాప హేతువగును పఱఁగ నిందు
కాన, నూరకుంటి కౌశికమునివర్య
కొట్టఁజాలఁ దీనిఁ బట్టి చంప.

వి—ఆహా! ఇదియా నీసంశయము.

గీ. దుష్టులను బరిమార్చుట దోసమగునె
అబలకాదిది రాక్షసి యధము రాలు
జాగుఁ జేసిన నందఱఁ జంపఁదలఁచు
శంక లేలను వధియింపఁజనును సుమ్ము.

అయ్యో! ఈరక్కసిముండను విడిచితివేని యిఁక నీరాకకుఁ బ్రయోజన మేమి? దుష్టశిక్షణయు, శిష్టరక్షణయు రాజులకు ధర్మము కాదా? అనేకుల నిరపరాధుల మిక్కుటముగ వంతలఁబుచ్చు నీదుష్టరక్కసిని దునిమిన నేమియు నఘము లేదు. అట్టి పాపకార్య మేమైన నేనెట్లు చేయుమని నిర్బంధనఁ జేతును? రామా! ఇంచుకయు సంశయింప నగత్యము లేదు. దగ్గఱకుఁ జేరుచున్నది. అస్త్రముల సిద్ధపఱిచి, ప్రయోగింపుము.

రా—(తనలో) ఈముని పల్కులు నత్యము లే యగును. ఇట్టి దాన వాధముల వధియించి తాపసుల రక్షించి భూభారమును మాన్పకున్న నాకు రాజనామ మేల? ఇంతియేగాక నాజన కుండును వీరి యభీష్టము నెఱవేర్పుమనియేకదా నన్నిందుఁ

బంపియుండెను. (ప్రకాశముగా) గాధినందనా! ఇదే శరము లఁ బ్రయోగించుచున్నవాఁడను. లక్ష్మణా! అటుచూడుము.

ఉ. రూపముఁ జూచినంత కడు రోతయుఁబుట్టును భీకరాకృతిన్
గోపముతోడ నీయెడకు గొబ్బున రాఁ బోఁడఁ గెన్ యదే యిటుల్
పాపము నెంచఁ గూడదిఁక బాణములే కొనఁ జూచెదిప్పుడీ
పాపిని దుర్రించకున్న మునిపాలిట శత్రువునయ్యెదన్ కదా.

(బాణముల విడుచును)

తా—(మండిపడుచు) ఓరోరీ నరాధములారా! నాక్రోధము నతిశయముఁ గావించి యేమూలను డాగియుండఁ బోయెదరు? అయ్యో! ఒక్క గుఱ్ఱకైడుమాంసమైన నున్న శరీరములు కావే.

మత్తకోకిల॥ నీవలారి యిదే కదా మిము నేర్పుమీఱఁగ దుర్రించెదన్
కాచువారలు యెవ్వరో కద కావరంబది యేలకో
చూచి కోపముఁబోవ నెయ్యెడఁ జూడగ కన్మి బాలు రే
తోచనో మదిఁ గాక యెవ్వడు దోషులివ్విధిఁ జెప్పిరో.

రా—మత్తకోకిల. ప్రల్లదంబులఁ బల్కు నేటికి భామ వం మను నెంచితే
కల్లలంమనుదప్పజెల్లునె కావరంబున నిట్టులన్
వల్లనౌ కౌశికముఖ్యులఁ జంపగ వాంఛలన్ని యుదీర్చు
మా యుల్లమందున నెంచియుంటిమి యోర్పు కల్గునె
యిప్పుడున్.

తా—(పెద్దనవ్వునవ్వుచు) హహహ! మీరలా నన్నుఁ జంపువారలు? గుఱ్ఱువచ్చి పిల్లను ధిక్కరించిన విధమున, నన్నుఁ జూచినంతనే దేవతలెల్ల, గజగజవణకుచు, భీతచిత్తులై మొక్కుచుండ మానవాధములును, చిన్నవయస్కులును గు మీరు నన్ను ధిక్కరించఁ జూచిరి కా సెహబాస్. మీధైర్యసాహసములకెంతయు

మెచ్చితిని. మీామోములఁజూడ ముద్దుకల్గుచున్నయది. కాన క్షమించి మిమ్ముఁజంపకవిడెదను. నాక్రోధాగ్ని నిరగుల జేయక, తిరుగ మీానివాసములకుఁ జనుఁడు.

రా—ఏమేమి? మాాయందునీకుఁ గరుణజనించెనా? ఎందఱెందరో, మునులు నీచేఁ బడరానిపాట్లుపొందుచుండ నిన్నాఁ రక పోనిత్తుమా? చాలుఁజాలు. నీవుమాాపైఁ గనికరమునుజూపి, మమ్ము క్షమించవలసినంతటి యగత్యములేదు. నీకోఁదలపడి. నిను గ్కాడియేపోవుదుము.

తా—అయిన నిఁకఁజాగేల?

(అని రాళ్ల వర్షమునుగురిపించును.)

రా—(క్రోధమూని శరవర్షములఁ గురిపించును)

తా—అయ్యో! ఈతఁడు చూాపులకు బాలుడయ్యు, బాణపరంపలచే నెంతయు నొప్పించుచుండెను. వీనిఁగెల్చుటదుస్సాధ్యము.

(అనితలఁచుచుమిాఁగబోవును.)

రా—(తిరుగ నొక బాణమును బ్రయోగింప)

తా—హా! హా! యనుచు నేలఁగూలి మరణించును.

(దేవతలుపుష్పవర్షమును గురిపింతురు.)

వి—(రామునిదగ్గరకుఁజేర్చుకొని)

సీ. శౌర్యమేపారగఁ జంపి యీాతాటకి
మునిగణములనెల్ల బ్రోచినావు
సాహసంబునుజూపి సరగునఁదెగటార్చి
కాచినాఁడవుమమ్ము కనికరమున
ఇంద్రాది దేవత లేమెడఁ జొచ్చిరో
బాధమాాన్పింతివయ్య భవ్యచరిత

ఇంతకాలమునకు వంతలన్నియుఁదీరి
స్వేఛతోవిహారించు సమయమబ్బె
గీ. వాసుదేవుడవీవెకా వసుధనిట్టి
నరునిరూపము ధరియించి పరఁగుచుంటి
వట్టికాకున్న శక్యమే యంతమొంద
జేయఁదాటకి రాజేంద్ర జేరఁదటిని.

రా—మునితిలకమా! ఇదంతయుఁ దమయాశీర్వచనఫలితమేకాని నాసామర్ధ్యముకాదు. మీాయనన్నింతగ బొగడఁదగునా?

వి—రామచంద్రా! నేనిఁక యాగముసాంగముగఁ జేయఁబూనెదను ఇంకను మారీచ, సుబాహులను నిరువురక్కసులు మిగిలియున్నవారలు. ఈతాటకిమరణవార్త వినినంతనే యుగ్రులై యరుదెంచుట నిక్కము.

రా—(ధైర్యముతో) రానింపు. ఒక్కక్షణమున వారిఁగూడ నాయమలోకమును జేరఁబంపెదను.

వి—(మీాదఁజేయివైచి) అందులసంశయమేమి! ఇంకను గొన్ని మహాస్త్రముల నొసంగెద. వాటినిధరింప నీవుగాక కెవ్వరర్హులు? కానఁ గైకొనుము.

రా—(వినయముతో) చిత్తము.

వి—(మంత్రోపదేశమొనర్చును) ఆరక్కసులువచ్చినంతనే తడయక కీటడగింపవలెనుసుమా?

రా—అంతటియప్రమత్తుఁడననియే తలపోసితిరా?

వి—రామా! ఇప్పుడేపోయి ప్రారంభించెద.

(అని నిష్క్రమించును)

రా—తమ్ముఁడా! అటుచూడుము. గగనమార్గానువర్తులై రోషావేశవివశులై తనరు నారక్కసుల మదోన్మత్తత నరయుము.

గీ. మానవాస్త్రంబుఁ గైకొని మానకిపుడె
వైచి సుడిగాలిచేవాఁడు పైచరుండ
నెగురఁగొట్టంగబడి మెడుపగిదిఁ జేతుఁ
జూడుతవున్నాఁడ లక్ష్మణ చోద్యమగగ.

(అనియస్త్రమును బ్రయోగింప మారీచుఁడు శతయోజనంబులదూర
మున సముద్రమునఁబడి మూర్ఛాగతుఁడగును.)

(తెరలో)

మా—(క్రోధముతో)

గీ. మ్రింగివైచెద నిపుడు మేలమాడఁ
జూచి రాక్షసా! యాగాదికములఁ గాచుకొనగ
నెందుఁ జేరెదు వారిలో నింద్రవంశు
వచ్చి కాచినవిడిచునే వంశ్యులయ్యె.

ల—అన్నయ్యా! వానిప్రలాపముల వింటివా?

రా—ప్రలాపములేమనచేం? రక్కసుఁడు ముందుబలికింపఁదొడఁగె. ఇంకఁ
దడసిన బ్రమాదము సంభవించును. యాగము సాంగము కాక
యున్న నీమునికోపమూనును.
ఈ యాగ్నేయాస్త్రంబున వీనిఁ దెగటార్చెద.

(అనిమంత్రించి విడుచును.)

(తెరలో)

మా—

గీ. మృత్యుదేవతదఱిఁ జేరె నృత్యమగున
టంచుఁ సంచరించితినింకఁ నాస లేల
ఈతఁ డెవ్వఁడో నరుఁడంచు నెంచియుంటి
కాక వేఱొకరీతియై కడకుఁ జంపె.

అయ్యో! చచ్చితిఁజచ్చితిని.

(అనికిౖిందపడి ప్రాణములవిడచును)

రా—యంటనుబడి మ్రిగ్గుప్పురుగుచందంబుననీతఁడట్టురే మరణించెను.

ల—ఇట్లుకూలఁజేయఁదగు సామర్థ్యము మీామెడఁ గల్గుటంబట్టియే, యీగాధినందనుఁడు జనకుఁడేవచ్చెదనన్నను వలదని, మిమ్ముఁ దోడ్కొనివచ్చెను ఈమూనీంద్రుని యాగమునిర్విఘ్నముగఁ గొనసాగినదికదా. అదిగో! యీకౌశికుఁడిటకేతెంచుచుండెను.

(ప్రవేశము:—విశ్వామిత్రుఁడు)

వి—(రామలక్ష్మణులఁజేరి) రామా! నీలమేఘశ్యామా! నిన్నేమని కొనియాడువాఁడ. ఓ! రఘువంశదీపకా! నాకోర్కెలన్నియు దీర్చి యాగమును నిర్విఘ్నముగజరిపించితివి. రక్కసులనొల్లదునుమాడి, మాకేకాక, ముల్లోకంబులకును మహోపకారమాచరించితివి. నీధైర్యసాహకృత్యంబుల వర్ణింప నానాదిశేషువునకైనఁ దరమగునా?

రా—ఆర్యా! విధికృత్యము నెఱవేర్చుకొనిన నన్నీరీతిఁబెద్దగఁజేసి నుతించిన నేమనువాఁడ? మూనీంద్రా! వచ్చినపని పూర్తియయ్యెనుగదా. ఇఁకనయోధ్యకుఁ జేరకున్న మదీయజనకుఁడు, మాకైయెంతయో పరితపించుచుండును. మాయందనురక్తులై పోవననుజ్ఞ నొసంగవేడుచున్నాను.

వి—రాఘవా! అటులనే వెడలవచ్చును. కాని. నేఁటికిచోటఁగడపి,

శక్త్యానుసారముగ నేనర్పించు విందుల నారగింపుము.

రా—(లక్ష్మణునిగాంచి) సోదరా! ఈమహానుభావుఁడు, మనయం దుండెడు వాత్సల్యముచే మనలవిడనాడనోపకున్న వాఁడు. మనమెంతటిధన్యులమోకదా.

ల—సదయహృదయులుకదా.

రా—మహాత్మా! తమకెదుఱాడువారమే! జనకునిసంతాపహేతు వగునేమోయని యెంచుచుంటినేకాఁ, నాకా, యయోధ్య కన్ననిదియే యెక్కుడానందకరమై కొంతకాల మిటవసింప బుద్ధి వొడముచున్నయది.



రా—ఇంతవర కెవ్వరును వచ్చియే యుండలేదా? లేక వచ్చియు సమర్థులు కాకపోయిరా?

వి—అదిసామాన్యపుధనువు కాదు.

గీ. తొల్లి హరుఁడద్దానితో దుష్టరక్క
సాళి దెగటార్చె నెత్తఁగ సాధ్యమగునె
సీత మాటలలనాడుచుఁ జిన్నతనము
నందునొకచేత నెత్తెను నసఘుచరిత.

రా—ఆహా! ఏమి! సీతయే దానినెత్తెనా? అయిన నిఁక కాలయాపన మేల? త్వరితముగఁ బోదమునడువుడు.

చ. వనితయె విల్లునెత్తి తన పాటవముం దగఁ జూపనింక యో
మునికులశ్రేష్ఠ రాజులకు మోసము కాదయొ యిప్డు వేగి నా
మనమున ధైర్యమూనికని మానక, రెండుగఁ జేతువిల్లు నే
ననయమునింతిఁ గూడిసుఖ మబ్బఁగఁ జేరెద శంక లేటికిన్.

వి—నీవట్టిసమర్థుఁడవనియే, యీవార్తఁ దెలిపి, నిన్నటకుఁ దోడ్కొని పోవనూహించితిని

రా—సీత భూజాతయంటిరి. అదెట్లు?

వి—జనకునకు గర్భవాసమునజనించిన వారెవ్వరును లేరు. ఒకనాఁడతఁడు యాగార్థము భూమినిదున్నుచుండ నొకపదార్థ మేమియో నాగటిచాలునకుఁ దగులొకాన నదేమియోయని త్రవ్వించిచూడ నదియొక పెట్టెయైయుండెనట. దానిని పైకిఁ దీసిచూడ నందొకబాలిక సజీవియై యుండెను. అనపత్యుఁడగుటచే దైవప్రసాదమనియెంతయు నానందించి, యామెనుగొనిపోయి కడుగారాబమున బెంచుకొను చుండెను. నాగటికొనకుఁ దగులుటంబట్టి లభించుటచే నాబిడకు 'సీత' యను నామంబిడెను.

రా—(లక్ష్మణునితో) లక్ష్మణా! వింటివా సీతవృత్తాంతము. తప్పక మనమందేగి, యాజనకునిఁగోర్కెఁదీర్చి, నిర్వక్రమ పరాక్రమమున నావనితను జేకొనుటయే ముఖ్యము.

ల—ఇంకను సందియమందనేల?

రా—ఆర్యా! ఒక్కసంశయముమాత్రము కలుగుచున్నయది. జనకుఁడు వేగిరముగిరమ్మని నుడివియుండెను. ఇట్లాతని యాజ్ఞ వడయకపోవుటచే నాతనియాగ్రహమునకుఁ బాత్రులమగుదుమేమో యని వెఱపు కలుగుచున్నయది.

వి—రామా! ఒకటిరెండుదినములేకదా కాలయాపన. ఇంతలోనే యాగ్రహము కలుగదు. ఒకవేళ నట్లైనను సందులకేను దగినను త్తరమిచ్చి, కోపమడగఁజేతును. కాన, మనమవశ్యమచ్చోటికిఁ బోకతప్పదు.

రా—ఇఁక మీచిత్తము.

---

గౌతమాశ్రమము.

(ప్రవేశము:—విశ్వామిత్రుఁడు, రామలక్ష్మణులు)

రా— ఋషివర్యా!

ఉ. ఎవ్వరిదాశ్రమం బిటుల నేటికినుండెఁ గళావిహీనమై
ఇవ్వనవాసమెంతగను నేవిధిఁ జూచిన సంతసంబె కా
పువ్వులతోట లాయెడను బొల్పుగఁ గానగనయ్యె నిందు లే
నవ్వులఁ బల్కుచున్న వన సర్మిలిజూడమె కీరజాలముల్.

వి—ఇదియే గౌతమమునీంద్రుని యాశ్రమము.

రా—ఆతఁడిచ్చోటును బాసిపోవఁగతంబేమి? ఇప్పుడెచ్చోట వసించుచుండె?

వి—

గీ. కలఁడహల్యయను బత్ని కమలనయన
పతివ్రతా తిలకమనఁగఁ బరఁగుచుండ
మోసమొనరించె నింద్రుఁడు మోహమనెడు
నంధకారమునను మ్రగ్గి యధమమునక.

రా—అయ్యో! దేవలోకాధిపతియగు నింద్రుఁడే మోహాంధకారుఁడై నీచప్రవర్తనలకు లోనయ్యెనుగా? పిమ్మట:—

వి—ప్రతిదినమున నా గౌతముఁడు తెల్లవాఱుటకు నాలుగుఘడియలు ముందుగనే లేచి, నదికిఁబోయి నిత్యకృత్యములఁదీర్చుకొని, సంధ్యావందనాదికార్యము లాచరించి తపమొనర్చుటవాడుకయై యున్నది.

రా—మునులకు విధియేకదా?

వి—ఇట్టుండ నొకానొకదినమున రాత్రికాలమున నా దేవేంద్రుఁడు రెండుయామములు కాకుండగనే యీయాశ్రమమును జేరి కోడిరూపధారియై కూయఁదొడంగెను.

రా—గౌతమునినింటనుండి తొలఁగించనుద్దేశించెను గాబోలును. తరువాత:—

వి—ఆకూతను వినినంతనే, మౌని మేల్కొని తెల్లవారవచ్చెనుగదా యని తత్తరపాటుతోఁ యథాప్రకారముగఁ బయలువెడలిపోయెను.

రా—అయ్యో! ఎట్టియెగ్గొనర్చ సాహసించెను!

వి—పిదపనింద్రుఁడు, గౌతమునివలె వేషమునుధరించి, యేదియో నెపమునఁ దిరిగివచ్చినటుల నటించి, తనమనోవాంఛ నెఱింగింప, నాపతివ్రతాతిలక మాతనిమాయఁదెలియనేరక భర్తయనియే భావించి యించుకయుశంకింపక యందులకు సిద్ధమయ్యె.

రా__పతివ్రతాశిరోమణి యనినైన నాలోచింపక, యీయింద్రుఁడాపెను గలియసిద్ధమయ్యెనుగా!

వి__

గీ. హానికల్గెడు వేళల నరయువశమె
తప్పులేయొప్పు లౌ కాదె తలఁచిరైన
మానఁజాలరు నీచత్వ మంకురింపఁ
గాక యిందుకేఁ జేకనులను గానకున్న.

రా__నిక్కము మహాత్మా!

వి__ఎట్టిమాయవేషధారియైనను సంభోగసమయమున నిజరూపముఁ దాల్పకతప్పదు. అహల్యవానిమాయను గ్రహించి, భయకంపితస్వాంతయై భర్తవలన నెట్టియపాయము వాటిల్లునో యని తత్తరపడుచుండె.

రా__అందాపె దోషమేమి?

వి__అంతయు సాంగముగనాలకింపుము. ఎంతకును దెల్లవారకుండుటచే, నిదేమియో మోసమని తలంచి, మాని దివ్యదృష్టిని జూచి,చర్యలన్నియు గ్రహించి, క్రోధావేశవివశుండై, నిప్పులఁగ్రక్కుచుఁ దిరిగివచ్చి, తలుపునుదట్ట, నాతనిపత్ని, వణకుచు,నేక ప్రాణమునఁ దలుపుఁ దెఱచినంతలో నితరములన్నియుఁ దిలకింపక, కానికార్యమొనర్చితివి కాన, శిలవై యుండుమని యామెను, సిగ్గుచేఁదలవంచుకొని, మూలనుడాగియున్న నిందురిని,శరీరమెల్లఁ గన్నులగునట్లును శాపమొసంగెను.

రా__ఎంతటిదారుణము. ఒకదుష్టునివలననే యపరాధమెఱుంగని యబలయుఁ జింత ననుభవించవలసిన దాయెను.

వి__తరువాతసంగతి నంతయుఁ దెలిపి శరణువేడ, నింద్రునికిఁ దనకుమాత్రమే శరీరమెల్లెడఁ గల్నులవలెఁ గన్పట్టుననియు, సహ

ల్యకు నీవుకొన్నాళ్ళ కీయాశ్రమమునకు వత్తువనియు, నీపాద ధూళి తగిలినంతనే యూపె నిజరూపమునుగాని నిష్కళంక యగుననియు, గను నార్ద్రహృదయుఁడై, తెలిపెను. అదిగో! ఆకనపడునదియేశిల. అచ్చోటికిఁ బోదముకంటు.

రా—అట్లనే నడువుడు.

(రాముని పాదధూళి తాకినంతనే, శిల స్త్రీయై రామునిఁగాంచి)

అ—(చేతులమోడ్చి)

గీ. జయము శ్రీరామ దేవేశ జయముజయము
పతితపావన మొక్కెదఁ బణతినయ్య
శాపవశమున శిలనుగా సంచరింప
దుఃఖమునుగంటఁ జేసితే తోయజాక్ష.

మహాత్మా! నేఁడుగా నీకృపాకటాక్ష వీక్షణములచేఁ బావనత్వంబు నొందితిని రామచంద్రా! నిన్నుఁగొనియాడ నేనెంతటిదానను.

గీ. భువనత్రయముల దిలకించి భూరియశము
నొందభక్తులఁ బ్రోచెడి వందనీయ
నిన్నుఁగొనియాడవశమానె నీరజాక్ష
అవతరించితివయ్య యీ యవనినిట్లు.

తొలిఁజేసిన శాపవశమున నా దేవతాధిపునిచే బరాభవింపబడి, తుద కీరీతిని జింతలఁ గుందవలసినదాన నైతిని. (అని సిగ్గుగొందును.)

రా—ఈమహేంద్రునివలన నెల్లవృత్తాంతమును వినియుంటిని. కర్మా నుఫల మనుభవింపక చెల్లునా? జరిగినదానికి విచారమేల? మే మొండొకకార్యార్థము పోవుచున్నాము. శుభమగునుగాక.

(ప్రవేశము—గౌతముఁడు.)

గౌ—(రామునిగాంచి)

మ. అవతారంబును దాల్చినాఁడ విటు మాయారూపధారుండవై
యవనీభారము మాన్పఁగా దలఁచి మమ్మా మోదమొందించి తే
భవదీయాకృతి నెన్న మావశమె మీ పాదంబులన్ బట్టు లే
యవసానంబున జేర్ప నిన్నుఁ దగునో యారాధ్య యిద్దే మ్రొక్కెదన్.

రా—అనఘా! పూజ్యులగు మీరలే నన్నింతఁ బెద్దగ జేయఁదగునా?

గౌ—రాఘవా! నీపాదధూళి సోకినంతనే నాధర్మపత్ని శాపవిమో
చనయై, తనరెడుభాగ్యములభించె. (అహల్యను గాంచి)
తన్వీ మనవిచారములడుగంటె ముందుగ మన మీ మహాను
భావున కర్ఘ్యపాద్యంబులనొసంగి పూజింతమురమ్మ.

(అని అట్లుచేయుదురు.)

(తెరపడును.)

---

## రెండవరంగము.

---

మిథిలానగరమందు రాజసౌధము-సభామంటపము-

పరివేశము:—జనకమహారాజు, సచివులు, మఱికొందఱురాజులు.

జ—ఆర్యులారా! ఇంతఁదనుకవచ్చిన రాజకుమారులలో నొక్క
రును సమర్థులై విల్లును యెత్తనైననెత్తఁజాలకుండిరి. ఇఁక
నీపుడమి నట్టిధీరుఁడే లేకుండెను గాబోలును. ఏమిసేయువాఁడ.
నిండుజవ్వనియై యలరారు నాపుత్రికారత్నము నెవ్వరికొసం
గుదును? ఎంతయుసంకటమయ్యె.

మం—రాజేంద్రా! ఆధాత మీ ముద్దులపుత్రిక కొకమహాను
భావుని భర్తగ నియమించియేయుండును. మనకుఁ దెలియ
కుండుటచే నిట్లు తలఁచవలసివచ్చినది.

గీ. భువిని జన్మింపఁజేసి తాఁ బూనకున్న
తగినవరునిఁ జూపింపగ ధాతయిట్లు
చింతనొందంగ నేటికిఁ జేరునెపుడో
సీతకునుదగ్గ భర్తయే చెలఁగవేడ్క.

జ.—అదిమెంచియేయూరటఁ గల్గించుకొనవలెఁగాని, భూలోకంబున నట్టిధీరుఁడు కనులకుఁ గన్పట్టుటలేదు ఏమహానుభావుఁ డందులకుఁ దగినవాఁడై, నాప్రతినఁదీర్చి సీతనుగైకొని సంతసాంబుధి నోలలాడఁజేయునో కదా.

(ప్రవేశ మొక సేవకుఁడు.)

సే.—(రాజునకు మ్రొక్కి) భూమీశా! ఇరువుర రాకొమరులం దోడ్కొని విశ్వామిత్రుఁడు వచ్చియుండె.

జ.—(లేచి, మంత్రులను మొదలగువారిఁగాంచి) అయ్యలారా! పోయి యాతనిఁ దోడ్కొనివత్తము రండు.

(అని వెడలి యర్ఘ్యపాద్యంబుల నిచ్చి తోడ్కొనివచ్చి విశ్వామిత్రుని రామలక్ష్మణులను నుచితాసనాసీనులుగఁ జేయును.)

జ.—మౌనివర్యా! తమరాకచే నేనేకాక- నారాజ్యంబతయు ధన్యతనొందెను. మీఁబోలుమహాత్ములూరక యేతెంతురా? భవదీయదర్శనంబున నేఁడెంతయు నానందమయ్యె. తపములును, యాగములును నెట్టియాటంకములును లేక నిర్విఘ్నముగ జరుగుచున్నవా?

వి.—రాజా! భగవదనుగ్రహమున నిప్పుడెట్టి యిక్కట్టులును లేక నిరాఘాటముగ సాగుచున్నయవి.

గీ. సుఖమె నీకును బ్రజలకు సుజననుతుఁడ
రాజ్యమందునఁ గలతలు రగలకుండ

శాంతిమార్గంబుఁ జూపుచు సచ్చరిత్రి
కాచుచుంటివె జనులను గరుణగల్గి.

జ—మహాత్మా! శక్తివంచనలేక ప్రజలను బిడ్డలకైవడిఁ జూచుచుఁ బాలనఁ జేయుచుంటిని.

మునివరేణ్యా!

ఉ. మోములఁగాంచినంత సతి మోహముఁబుట్టెడు నట్టివారలే
నామములన్ బరంగుదురొ నాకును దెల్పవె మౌనిచంద్రమా
యేమహనీయ లీసుతుల నింపుగఁగాంచిరొ పుణ్యమూర్తులై
ఈమహినిట్టులన్ వెలసి యిందును జేరిన దేవతాంశులో.

సీ. మోములలే నవ్వు మొలకలెత్తియు సదా
పీడకయుండెను పీనులెగద
న్యాయమార్గముఁజూప నరుఁడు నారాయణ
మూర్తులే యీరీతి బుడమిఁజుట్టి
సంచారమొనరింప నాగిరో చూడగఁ
దనివితీరుటలేదు ధాత వీరి
సృజియింప నెంతగ శోచనీయముకద
యవతారపురుషులే యగుదురరయ

గీ. ఇట్టిబాలురఁ గాంచగ నెట్టిభాగ్య
మగునొ భవదీయకరుణచే నరయనయ్యె
దాచకుండగఁ దెల్పుఁడు తాపసేంద్ర
వీరిచరితంబు వినగన వేడుకయ్యె.

వి—జనకా! తెల్పెదను వినుము.

గీ. పుణ్యమూర్తులు దశరథ పుత్రులయ్యు
రామలక్ష్మణులనియెడు రాజసుతులు

చర్యలన్నియుఁ దిలకించ జనక! వీరు
అవతరించిన దేవత లనఁగఁజెల్లు.

జ—ఆహా! ఎంతయుసంతసమయ్యె, గాధినందనా వీరలొనర్చిన నను
పమసాహసకార్యంబు లెవ్వి?

వి—ఈరాముఁడు-

సీ. జనకుపంపునవచ్చి కాననంబులఁ జేరి
తాటకఁ దునుమాడి దర్పమడచె

జ—(ఆశ్చర్యముతో) ఏమి! తాటకినే వధించెఁగా-పిదప

వి— మడియింపఁ జేయఁగ మానసంబున నెంచి
క్రోధపూరితులయ్యుఁ గూళ్లైన
మారీచుడనువాని మదమును నణగింపఁ
బడవైచె వారధిఁ బాణతతిని
పిదప సుబాహుఁడు ప్రేలుచుఁ గారులఁ
జేరగ నాతనిఁ జంపివైచె

గీ. అట్టి శ్రీరాముఁ డీతఁడే యనఘవినుమ
పాపరహితుఁడు శిలయగు పణతిశాప
మంతమొందించి గౌతము నలరఁజేసె
సంతసమున నహల్యను సతినినిచ్చి.

జ—(తనలో) ఈ మహానుభావుఁడు నిక్కముగ నీపుడమి భారము
మాన్పనవతరించిన నామహావిష్ణువేయైయుండనోవు. కాకున్న
నిట్టిచిన్నతనమందిట్టి మహాకార్యము లాచరింపనేరికి వశమగు
ను. ఈనవమోహనాకారుఁ డీహరువిల్లు నెక్కుపెట్టినాముద్దుల
తనయను జేపట్టిన నాభాగ్య మేమనువాఁడ. అంతటి యదృష్ట
వంతుఁడనగుదునా? ఇట్టి యనుపమ పరాక్రమశాలికీ విల్లు
నెత్తుటొక లెక్కయా!

వి—జనకా! ఏమి యో మనమునఁ దర్కించుచున్నటులఁ దోచు చున్నది.

జన—మహాత్మా! ఆలోచన సేయుటకేమున్నది. ఈ బాలుఁడే యిట్టి మహాద్భుతకార్యములొనరించి యుండెనాయని యాశ్చ నిమగ్నుఁడనగుచుంటిని.

వి—అట్టిశంకలఁ దీర్చుటకే వీరినిటకుఁ దోడ్కొని వచ్చితిని.

జ—ముని తిలకమా! మీపల్కుల కర్థము గ్రహింపఁ జాలకున్నాను

వి— గీ. వీరులందఱు విడచిన విల్లుఁజూపు
మెత్తఁజాలును రాముఁడు పట్టుదలను
తనరు సీతఁడె భర్తయై ధరణిసుతకు
శంకలేలను నిక్కము జనకయిదియు

జ—అట్టిదైన నానోములన్నియు ఫలించినట్టే కదా కాని, యెంద ఱెందఱో వీరాగ్రేసరులని ప్రసిద్ధివడసిన రాజపుత్రులొనఁ జేసి, యెన్నెన్నియో ప్రగల్భులఁ బలికి తుదకు నిండుసభ నా కోదండమును, గొంచెమైన నెత్తఁ జాలక కొందఱును, గొలఁ దిగనెత్తి నిరర్థమగుటచేవీడియుఁ గొందఱు నిట్లనేకరీతుల సప జయమొంది, సిగ్గుచేఁదలలు వంచుకొనవలసిన వారైరి అట్టి దాని నెక్కుపెట్ట నీబాలురు సమర్థులగుదురోయని మనమున వెఱచుచున్నవాఁడ

వి— గీ. బాలుఁడేయగుఁ జూపుల బాహుబలము
నెన్నశక్యమె భూనాథ పిన్ననాఁడె
తెలుపభీతియొాపనులను దనరియుండె
సందియంబేల నీమదిఁ జాలుఁజాలు

కాన నావింటినిజూపుము.

జ—(ఒకప్రక్కనున్న ధనువును జూపి)

మహాత్మా! తొల్లి దేవాసురయుద్ధంబున నాశంకరుఁడు నిశాచరుల వధింపధరించి పరిమార్చినట్టి యీవింటినింత దనుక నెట్టి పరాక్రమశాలియుఁ జూడఁ జాలకయుండెను. మమ్ముల ధన్యులఁ జేయనీరాముఁడే తెంచెనని నుడివి యుండిరి. ఏమగునో చూచెదఁగాక.

వి—(రాముని(గాంచి)

రామా! ఇంకనుఁదడవేలచేసెదవు? ఈనిండు కొలువున నీరాజులందఱు చూచుచుండ, నిజ భుజ పరాక్రమమువెల్లడించుచు దీనినెక్కువెట్టి సకల జన మనోరంజకుండవై యీ జనకుని ముద్దులపుత్రికయగు సీతాదేవికి నాథుఁడవుకమ్మ

రా—(విశ్వామిత్రునకు మొక్కి సభాసదులఁగాంచి)

గీ. మౌని యాజ్ఞను దలఁదాల్చి మసలుచుంటి
జయమగునొ కాకను నపజయమె యగునొ
దైవసంకల్పమేమియో తలఁచనెట్లు
సాధ్యమగుఁ దలఁపడిచూతు సైచియెత్త

(విల్లునుద్దేశించి)

గీ. ఎల్లరువిడచియుండ నే నెత్తఁదలచి
మ్రొక్కెదను గేలుమోడిచి మొదటనీకుఁ
గరుణఁజూపుమునాయందుఁ గదియనిన్నుఁ
బింకమునుదాల్చకుండుము పేర్మితోడ

(అని మనమున ధ్యానించి దఱిని జేరును.)

(అటనున్నవారెల్ల నిర్భ్రాంత మనస్కులై నివ్వెరపడి చూచుచుందురు)

(శ్రీ) రాముఁడు విల్లునతిచుల్కనగనెత్తి నారిత్రాడుసంధింపనుద్యుక్తుఁడు కాగా భూనభోంరాంతములు తల్లడిల్లుధ్వనితో విఱుగ విశ్వామిత్రుఁడు జనకుఁడు లక్ష్మణుఁడు తక్క మిగిలిన వారెల్ల మూర్ఛాగతులగుదురు)

జ—(రాముని కౌగలించి)

ఉ॥ మనుజుఁడ వీవు కావుయిటు మానవురీతిని నుద్భవించినన్
యనఘుడ వాదిదేవుఁడవు యాసలఁ దీర్పగ నెంచి యీ విధిన్
జనకుని పంపునన్ వచ్చిని జంపియు రక్కసులన్ యటన్వానిన్
దనరగనిట్లు వచ్చిమము ధన్యులఁ జేసితివో రఘూత్తమా

గీ. శ్రీకరుఁడవీవె నాదగుఁ జన్మవృత్తి
సీతనిచ్చెదఁ గైకొమ్ము సతిగరామ
తగిన వరుఁడవు నీవెకా ధన్యచరిత
అమిత మగు సంతసముకల్గె నవనిపాల

ఏనాపెనెంతయుఁ బ్రేమాతిరేకంబునఁ బెంచుకొనుచుంటిని పుత్రికయైనను బుత్రుఁడైనను నామెయే సదయ హృదయుఁడవై పత్నిగఁ జేకొని మమ్ములను నానందవార్ధి నోలలాడించుము. ఇదియే నా కోరిక

రా—(వినయసంతసములుదోప) ఆజ్ఞకుబద్ధుఁడను.

జ—మౌనీంద్రా! భవదీయకటాక్షంబున నిన్నాళ్ళకు నాకోర్కె నెఱవేరెను. ఇఁకముం దొనర్పవలసినఁ గార్యములేవియో సెలవిండు.

వి—జనకా! నీవెఱుంగవా? అయిన నిఁక దశరథుని, యాతని బంధుమిత్రుల నాహ్వానించి పరిణయమొనర్చుటయే కర్తవ్యము.

జ—సచివవరేణ్యా! శుభలేఖ నొకదానినివ్రాసి దశరథమహారాజునకుఁ బనుపుము.

మం—చిత్తము.

---



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# సీతాకళ్యాణము

## చతుర్థాంకము.

### అయోధ్యాపురమండలి రాజసౌధము.

(ప్రవేశము—దశరథుఁడు, వసిష్ఠుఁడు, సుమంత్రుఁడు)

ద—గురువరేణ్యా! నా చిన్నికుమారులు రామలక్ష్మణులు యింకను రాకుండుటకుఁ గతం బేమిటో? ఆరక్కసులు మునుమూఁడ సాధ్యమయ్యెనో లేక యుద్ధమునఁ జిగిలియున్నవారలో? ఏక్షణంబున నా శ్రీరాముని, లక్ష్మణుని గనులారఁ గాంచి, ముద్దాడువాఁడనో యని మనము తత్తరిల్లుచున్నయది.

గీ. దురితమియుండిరో రిపులను దుర్భరంబు
    కాగ మోసమున వస్తులై కలఁతఁజిక్కి
    కుందుచున్నారొ తెలియదు కోమలాంగు
    లైనసుతుల నెన్నఁడిఁకను నరయనగునో.

వ—రాజా! ఆకౌశికుని చెంతనుండ, నీతనయుల కెట్టిహానియుఁ గలుగదు. ఇంతియేకాక, యాశ్రీరాముని నోటమిఁబుచ్చ నెవ్వరికిని శక్యముకాదని మున్నాటికిని నమ్ముము. సమరమునకుఁ బిమ్మట విహారార్థ మచ్చోటనే, కొలదికాలముండ నిచ్ఛవొడముటచేఁ బడసియుండనోపు.

ద—ఆరామునికి సాహాయ్య మొనరింప నేనుగూడ నందుఁ జేరఁబోదునా?

వ—వృథా ప్రయాసయేకాని, నేఁడో రేపో వారు తప్పక తిరిగి రాఁగలరు.

ద—అట్టిదైన నెంతయు ధన్యుఁడను.

వ— గీ. పురుషసింహమనగ నొప్పుఁ బుడమిరాముఁ
డాతనికి సాయ మొనరింప నగునె మనకు
వచ్చిచేరును నెన్నఁడుఁ బాయకుంట
నిట్టితలపులు కలిగె నీ కిందు నేఁడు.

ఇదియునుగాక పుత్రివాత్సల్యమిాతినే యుండునుకదా. లేక లేక చిర కాలమునకుఁ బుత్రిసంతతి కలుగుటఁబట్టి మఱియు విచార నిమగ్నులగుట సహజమే.

ద—ఎట్టిపదార్థ మెడబాయుమన్నను వెనుఁదీయనుగాని, నాముద్దుల పుత్రుని, నవమన్మథాకారుని, నీలమేఘశ్యాముని, సకలజన మనోరంజకుని, నా శ్రీరామచంద్రుని వీడి యొక్కక్షణమైన నిలువజాలను. అతఁడే నా జీవనము అతఁడే నాకు సర్వసంప దలు అతఁడు దఱిలేని నాకీ జన్మయేల? నాకీ రాజ్యభోగము లేల?

(ప్రవేశ మొక సేవకుఁడు)

సే—రాజేంద్రా! వందనము.

ద—ఏమిరా! ఇంత త్వరితమునేగుదెంచుటకుఁ గారణమేమి?

సే—మిథిలా నగరమునుండి, యిరువురు విప్రులేతెంచి యున్నారు మహాత్మా!

ద—ఏమి! మిథిలానగరమునుండియా? (వసిష్ఠునిగాంచి) మునివర్యా! కారణమేమై యుండును?

సేవకా! సత్వరంబునఁ దోడ్కొనిరమ్ము

వ—విప్రుల టుదెంచి యుండుటఁబట్టియు, సచ్చరితుఁడగు జనకచక్రి

వర్తి పనుపునవచ్చియుండుటచేతను నేదియో శుభకార్యార్థులై వచ్చియుండనోపునని తోఁచుచున్నయది.

ద — జ్ఞప్తికి వచ్చినది. ఆ జనకునకు సీతయను నొక పుత్త్రికయుండె ననియు, నీనడుమ, దనయింటనున్న, శివధనుస్సు నెవ్వరెక్కు వెట్టఁగలరో వారికిచ్చి పరిణయమాచరించెదనని, యెల్లెడఁ జాటఁబనిచెననియు, వినియుంటిమికదా! ఎవ్వరోయొక రాజన్యుఁడా ప్రతినను దీర్చ, వానికిచ్చిపెండిలిఁగావింప నిశ్చయించి మనలఁ గూడ నాహ్వానింప నీ విప్రులఁ బుత్తెంచి యుండును.

వ — తినఁబోవుచురుచి కోనేల? ఏమైనదియు నిప్పుడే తెలిసికొనఁ గల్గుదుముకదా.

(ప్రవేశము — విప్రులు)

ద — (లేచి నమస్కరించును)

బ్రా — రాజేంద్రా! శుభమగుఁగాక —

ద — ఆర్యా! ఇష్టాసనము సేయుఁడు.

బ్రా — (ఉచితాసనాసీనులగుదురు.)

ద — అయ్యా! మీ రాజేంద్రుఁడాదియందఱును గుశలంబుననున్నవారలేకదా?

బ్రా — అందఱును గుశలులై యున్నవారలు.

ద — మీరిందు కేగుదెంచుటకుఁ గతంబేమి?

బ్రా — రాజా! మీతనయుఁడగు రఘురాముఁడు, కౌశికునితో నటవులకేగి, రక్కసులనెల్ల దునుమాడి, మౌనియాగము సంరక్షించి, పిదప నామౌనీంద్రుని ప్రోత్సాహముచే మిథిలకుఁ జేరఁబయలువెడలి, మార్గమున గౌతమముని యాశ్రమమును జేరి యహల్యాశాపవిమోచనముఁగావించి, మిథిలకువచ్చి, రాజన్యులెల్లరయెదుట, నందఱకశక్యంబైతనరువింటినివిఱిచెను. తత్కా

తూహలంబున నాజనకచక్రవర్తి, తనముద్దులపుత్త్రికయగు సీతాదేవి నీయస్థిరపర్చి మునియాజ్ఞనువడసి మీకీలేఖనంపి యుండెను.

(అనిమూటనువిప్పి శుభలేఖనిచ్చును.)

ద—(జాబుపుచ్చుకొని) ఏమినాభాగ్యము!
(సుమంతునుద్దేశించి) సుమంత్రా దీనినామూలాగ్రముగఁ జదువుము.
సు—(దానిఁగైకొని యిట్లుచదువఁదొడఁగును.)

శా. శ్రీరాజన్యసదాశుభంబులొసగన్ శ్రీదేవి నీచెంతనే
జేరెన్ మోహముతోడఁగొల్తువెపుడున్ చీకాకుఁ లేదాయెగా
నీ రేజాక్షుఁడు నీకుఁబుత్త్రుఁడనగన్ నీపుణ్యమెంతోనోయా
పారావారమహీతలంబున నినున్ వంచింపలేరెవ్వరున్.

ఉ. మోదముకల్గెనెంతయును భూరియశంబునుబొందఁజాలితిన్
వాదములెల్లఁదీర్చి రఘువర్యుఁడువిల్లునునొక్కపట్టునన్
సాదరవాక్యలన్నుడివి చయ్యనఁదావిఱిచెన్యసాధ్యమౌ
కాదనఁజాలకేనృపులు కప్పిరిమోములసిగ్గుతోఁపగన్.

అందుచే,

గీ. వియ్యమందఁగనెంచితి విబుధవంద్య!
సీతనర్పించిరాముని జెంతఁజేర్పఁ
గాధినందనునాజ్ఞను గాంచినాఁడ
సమ్మతించుముదశరథ! సానుభూతి.

సీ. పరికింపఁ బరికింపఁ బంకజాక్షుఁడెకాడె
భాగ్యమొసఁగ వశమె భవ్యచరిత
ప్రతిననునెరవేర్చి భగ్నంబుఁగావించె
హరువిల్లుక్షణమున నహహాయనఁగ
సీతకుఁ దగుభర్త చేరకుండెనటంచుఁ
జింతిలుచుండఁగఁ జెంతఁజేరె

మహానీశుదయచేత మనకువివ్యాహము నంద
నయ్యెగా ముదమొంద నార్య! యిప్డు
గీ. బంధుమిత్రులఁ గూడియు బయలువెడలి
వచ్చిశుభముల సాగించి వరలుఁ డయ్య
కాలయాపనఁ జేసియుఁ గలఁతనొందఁ
జేయుటొప్పనె భూనాధ! చేరువేగ.

ఇట్లు విధేయుఁడు,
మిధిలాధీశుఁడు,
జనకుఁడు.

సుం—(మరల నాజాబును మణచి రాజునకొసంగును.)
ద—బ్రాహ్మణోత్తములారా! ఎంతయునానందమయ్యె. అట్లనేపోవు
దము. గురువరేణ్యా! వింటిరా యీజాబునఁగల విషయములు
వ—రాజా!ఏను దొలుఁతనే రాముని సామర్థ్యమును జెప్పియుండలేదా?
నీవాతని వనికంపుటకే యెంతయు భీతినొందితివి.
ద—బాలురని శంకించితిని మహాత్మా. (సుమంతుని గాంచి) సుమం
తా! చతురంగబలములను, రథములు మొదలగువాటి నన్నిటి
నాయత్తపఱుపుము.
సు—చిత్తము.
ద—రేపే పయనంబుల సాగింపవలయును.
వ—కాకున్న నిఁకవ్య వధియే లేదు.
ద—గురువరా! మనమిఁక పోవుదమా? నేఁబోయి యీశుభవార్తఁ
గౌసల్యాదియంతఃపురస్త్రీలకెఱింగించెద.
(అందఱును నిష్క్రమింతురు.)
(తెరపడును)

రెండవరంగము.

(మిథిలాపురమందున్న యూరిబయలు.)

ప్రవేశము:- దశరథుఁడు, వసిష్ఠుఁడు, సుమంత్రుఁడు మొదలగువారు వచ్చుచుండ, జనకుఁడు మంత్రులు, పురోహితులు మొదలగువారితోఁ బ్రవేశము.

జ.—(దశరథునిగాంచి) ఆర్యా! మీరాకను గనినంతనే—

గీ. సంతసముకల్గె నేఁడుగ స్వాగతమును
గైకొనఁ గను వేడుచుంటిని కరుణఁబూని
నాదుమనవిని జేకొని న్యాయముఱసి
వచ్చియుంటివి రాజేంద్ర! భావ్యమిదియె.

ద.—(మందహాసమున) రాకున్న బావగారి కాగ్రహము జనించునేమో యని భీతికల్గుటచేఁ దప్పినదికాదు.

జ.—ఈసమయమున నెందులకైన మీరలే సమర్థులు. నేఁడు మిమ్ముల నొకభవనమునందుంచి ద్వారములఁ బిగించెదము రండు.

ద.—కానిండు. నేఁడే యననేల? మీవశమున నున్నంతవఱకును, మీ యిచ్చవచ్చిన ట్లొనర్పవచ్చును.

(అందఱును బురములోనికిఁ బోవుదురు.)

(ప్రదేశము:- దశరథుఁడు విడిసిన భవనము.)

ప్రవేశము:-దశరథుఁ డాసీనుఁడై యుండఁ గౌశికుఁడు, రామ లక్ష్మణులు.

ద.—(రామ లక్ష్మణులఁ గౌఁగిలించుకొని) మునివర్యా! మీరాకకుఁ దడవగుటచే, నేమికతమోయని చింతిలుచుండ, నీశుభవార్తనుగైకొని విప్రులేతెంచి యమితానందమును గొల్పిరి. దీనికంతకును మూలకారణులు తామేకదా?

వి—రాముఁడే మూలకారణుఁడు.

ద—రామా! ముద్దులతనయా!

సీ. కడుపున నినుఁగని ఖ్యాతినొందుచునుంటి
　　　　మునిపల్కు లరయక మొదట నెంతొ
　భీతిచేఁగుందితిఁ బెండ్లితో నేఁడిట్లు
　　　　సంతసాంబుధిఁ దేలి చనఁగనయ్యె
　ఇట్టి తనయులనొంద నిల నెట్టిధన్యులో
　　　　జననిజనకు లెన్న సచ్చరిత్ర
　పంకజాక్షుఁడవంచుఁ బరిపరీక్షితులఁ
　　　　గొనియాడు మునులను గూర్చిచూడ

గీ. నస్మృతంబులెట్లగు నట్లు యూరిదేవుఁ
　డవా ఘుల నవతరించి యీయననిఖిల
　మంతఁదీర్పంగ నెంచితో నరయఁజాల
　రఘుకులమున కంతకు రాదె కాంతి.

వి—దశరథా! ఆసీతాదేవి, నవలావణ్యవతియై, యా యాదిలక్ష్మి
　　యే యవతరించినటులఁ బ్రకాశింపుచున్నయది.

ద—భవదాశీర్వచనముల ఫలము లూరకపోవునా?

　　(ప్రవేశము—జనకుని మంత్రియు, బురోహితుఁడును)

ద—(వారినందఱ నాహ్వానించి యుచితాసనంబుల నధిష్ఠింపఁ
　　జేయును.)

మం—రాజేంద్రా! జనకచక్రవర్తి మీకొకవార్తను దెలుపఁ బంపి
　　యున్నాఁడు.

ద—ఏమది?

మం—అతనివాక్యములుగా నిట్లు చెప్పుమనియె.

గీ. రామునకు సీతనిచ్చియు రాజ! వీధవ
నూర్మిళను లక్ష్మణునికిచ్చి యుచితరీతి
మాండవీశ్రుతకీర్తుల మానకిపుడె
భరతశత్రుఘ్నులకు నిచ్చి పఱగనగునె.

ఇందు మీయానతిఁ గొన వేచియున్నవారు.

ద—మునీంద్రా! వింటిరా? ఒకటివెంబడి నొకటిగ శుభములు తమంతటఁదామే వచ్చి చేరుచున్నవి. ఇంతకును బూర్వమే నొనర్చిన పుణ్యమేమియో? (మంత్రినిగాంచి) మంత్రిసత్తమా! మాసమ్మతిని దెల్పుము. ఇంతకన్నను భాగ్యమేమికలదు?

పు—రాజేంద్రా! ముహూర్తకాలము సమీపించుచున్నది. త్వరపడవలెను.

ద—చిత్తము.

(మంత్రియుఁ బురోహితుఁడును నిష్క్రమింతురు.)

ద—సుమంతా! మనకు వలయుసామగ్రినంతయు సిద్ధపరుప నాజ్ఞాపింపుము.

సు—చిత్తము. (అని నిష్క్రమించును.)

ద—మునీంద్రా! ఇఁక మనమునుబోయి వలయునన్నాహములు సిద్ధపఱచుకొందమా?

వి— మంచిది. నడువుఁడు.

(అందఱును నిష్క్రమింతురు.)

(తెరపడును.)

వివాహమంటపము.

(ప్రవేశము.—దశరథుఁడు, జనకుఁడు, విశ్వామిత్రుఁడు, వసిష్ఠుఁడు, పెండ్లికొమారులు)

జ—(వసిష్ఠునిగాంచి) మహాత్మా!

గీ. మునుముంశోఁగూడి యాశుభమునకుఁ రాము
తగఁబురోహితులయ్యెను ధన్యతమర
వేకుకనుజానపవలయును విబుధవర్య
సంతసాంబుధిఁ దేలంగ సచ్చరిత్రి

వ—అట్లనేకావించెదను.

జ—మహాప్రసాదము- (సేవకునొకనిగాంచి) సేవకా! పెండ్లికొమరె
తలను సత్వరంబుగఁ దోడ్కొని రమ్మనిచెప్పుము.

సే—చిత్తము
(అని నిష్క్రమించును.)

(ప్రవేశము:—దాసీజనముతోఁ బెండ్లికొమరితలు)

జ—(సీతనుగాంచి చేరఁదీసి)

గీ. అమ్మ!యాతఁడె శ్రీరాముఁ డనగఁబరఁగు
దగిన భర్తగూ నీకు, ధనువుఁగూర్చి
ఖ్యాతిఁ గాంచిన సీతని గనుమునిప్డుఁ
జేరిసుఖయింపుమిప్పుడే చింతలేక.

(రామునిహస్తమునొకచేతను సీతహస్తమునొకచేతను బట్టుకొని)
రామచంద్రా! ఈ సీతను నీకుఁ బత్నిగ నర్పించుచుంటిని.

సీ. ఏరీతిఁజూచెదో యేమియుఁదెలియని
ముగ్ధసుమా శ్రీరామ! ముదితసీత
తల్లిదండ్రులచెంతఁ దనయిచ్చవచ్చినఁ
గోర్కెలన్నియుఁ దీర్చుకొనెడుసాధ్వి
పరుషములాడిన భరియింపఁ జాలని
మానవతీమణి మనుజనాథ!
భక్తితోనిన్నితా భజియించుచుండును
దప్పుఁజేయవెజుచు నొప్పుఁగాంచు

గీ. కోపమూనకు మయ్య యీ కోమలాంగి
నిదిమెయర్పించుచున్నాఁడ నెద్దియైన
నీయదే భారమెట్టుల నెలఁతఁ గాంచి
కాచుకొందువొ రాఘవా! కమలనయన.

ఉ. పెంచితి నింత కాలమును బేర్మితొ రాఘవ! సచ్చరిత్ర నీ
వెంచకు మయ్య తప్పులును వీడను మానసమందు నిప్పుఁడా
వంచనసైపఁజాలదిఁక భారము నీయదె సీత యెప్పుడున్
గాంచదు దుర్గుణంబులను గాంతను జూడుము వేడ్క మీరఁగన్
(అని సీతహస్తమును రాముని కొసఁగును.)

(సీత పుష్పహారమును రాముని కంఠమున నుంచును)

రా—ఆజ్ఞచొప్పననే వర్తించెదను.

(దుందుభినాదములు మ్రోగును.)

(పిమ్మట జనకుఁడు, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు,
నూర్మిళ, మాండవి, శ్రుతకీర్తుల నర్పించును)

(బ్రాహ్మణు లాశీర్వాదమును గావింతురు, దేవతలు
పుష్పవర్ష మును గురిపింతురు.)





శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# సీతాకళ్యాణము

## పంచమాంకము.

(దశరథుఁడు, పుత్రులతోను, కోడండ్రతోను, గలిసి బంధుమిత్ర సమేతముగా, నయోధ్యకుఁ బోవుచుండ మార్గమున)

ద—(వసిష్ఠునిగాంచి) గురువరేణ్యా!

గీ. అపశకునములు కాఁజొచ్చె నక్కటకట!
యేమియాపదల్ కూడునో యింధుమనకు
దోఁచదాయెను దెల్పుఁడు దాచకుండ
మదిని జింతలుబుట్టియు మసలుఁదోఁడఁగె.

(తెరలో, క్రోధముతో)

ఉ. పోవుచునున్నవాఁడ వికఁ బోఁగనాగుము విఱ్ఱవీఁగియుక్
సీవిటు వింటినిన్విఱిచి నెమ్మనిదాల్చితె సంతసంబు రా
మా! వలదట్లుపోకడలు మానకకూల్చెద నొక్కవ్రేటునన్
కావరమేల చూడుమిదె కాదనకన్ హరువిల్లుఁ గూల్చితే.

ద—ఆర్యా! బ్రహ్మాండంబులు బ్రద్దలగునట్లు బొబ్బలిడుచు నట్లు క్రోధాంధుఁడై వచ్చుచున్నవాఁ డెవఁడు?

వ—ఇంకెవ్వరు? రాజులందఱఁ గూల్చఁ ప్రతిజ్ఞఁబూని చెలరేగియున్న నాపరశురాముఁడే యిం దటుదెంచుచున్నవాఁడు.

ద—(భయభ్రాంతుఁడై వణకుచు) అయ్యో! ఏమి యాపద లోనఁ గూర్చునో కదా. ఆతని కీరాముఁ డొనర్చిన యెగ్గేమి?

వ—దుర్మార్గమే చేయఁదలఁచువారికిఁ గారణములు కావలెనా?

ద—నా యీముద్దులతనయున కెట్టి హానిసంభవించునోకదా!

వ—రాజా! భీతినొందకుము. మనరాముఁడే యాతనిఁగూల్పఁగలఁడు!

ద— మానీంద్రా! అది దుస్సాధ్యము.

(ప్రవేశము:—పరశురాముఁడు)

ప—(క్రోధముతో - రామునిఁగాంచి) ఏమేమి! అజనకునియింటనున్న శివధనుస్సును, గర్వాంధుఁడవై, భగ్నముఁగావించినవాఁడ వీవేనా? ఇప్పుడెందేగెదవు? నీధైర్యసాహసము లిప్పుడుజూతుము. చేతఁజిక్కి, యెక్కడమానుగాననిదె సాక్ష్యమగునా!

వ—(లక్ష్మణునిఁగాంచి) మీరీవనితలఁ దోడ్కొనిపోయి, కొలది దూరంబుననుండుఁడు.

ల—చిత్తము. (అని యావనితలఁ దోడ్కొని భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు నిష్క్రమింతురు.)

ద—(పరశురామునికి వందన మాచరించి విచారవదనముతో) మహాత్మా!

సీ. ఆర్యరో! చింతతో ననపత్యుఁడనగను
చాలకాలము దాక చనగనయ్యె
తుదకుఁ బుణ్యంబునఁ బడసి సుతులను
బడయంగనయ్యెను భవ్యచరిత
చిన్నవయసువాఁడు చేరినీతని వధి
యింపఁబూనుటదేల యీర్ష్యతోడఁ
దనయుఁ డీతనివిడి తనువుతో నేరీతి
వర్తింపఁగలనయ్య వంతలొందఁ
గీ. జేయుఁ జెల్లునె కావుము చేతులెత్తి
మ్రొక్కెదను సైపుమీతప్పు ముదముతోడఁ

బోవనాజ్ఞ నోసంగుము భూరిగుణము
కాదె? శరణనఁ గాచుట కదనమేల?

ప—చాలుఁ జాలు! నీవలెనే గాజులఁదాల్చి, వనితలవలె నంతఃపురములఁజేరుమందువుకాబోలును. ఇంచుకైన మదిశంకింపక, తగని పనికిట్లు సిద్ధపడఁ జెల్లునా? అంత కావరమా? పరశురాముఁడు లేడనియే యెంచియుండెనుగాబోలు! ఎదిటిపోటునశక్తులగువారున్నఁ జోటునఁ బౌరుషముఁ జూపిననేమిఫలము? ఆధైర్యసాహసముల నిప్పుడు చూపవలెను? లేదా, నీవలెఁ గాజులఁ దొడిగించుకొని, యిటను దాగియుండవలె. ఏమైనను గతనముతప్పదు.

ద—అయ్యో! సమస్తమెఱింగిన, భూసురోత్తములు మీరలే యిట్లు నిర్దయఁబూనివర్తించిన నింకేమి తెఱువు?

ప—ఈభీతి యప్పుడు లేకుండెను?

ద—తెలియకఁజేసినఁ దప్పిదమునుసైచి రక్షింపుడు.

ప—దశరథా! వేయేల? ఇప్పుడుసమరమున నాతఁడైనఁ గూలవలె. లేకనేనైన మడియవలె. ఇద్దరు రాము లుండరాదు.

ద—(తనలో) ఈతఁడు తనపట్టునువీడకున్నాఁడు. ఇఁకేమిదిక్కు? నాచిన్నికుమారుఁ డీతనితోఁదలపడఁజాలునే? ఏమిసేయువాఁడ? ఏమిదిక్కు? ఆనాఁడావిశ్వామిత్రుఁడేల వనికిఁ గొనిపోవలె? ఒకవేళనట్లైననటనుండి, మిథిలానగరమునకేగనేల? ఇవన్నియు లేకున్న నారామునికిట్టి యిక్కట్లును లేకయుండును గదా.

హా! పరమేశ్వరా! నాకోర్కెలన్నియు సఫలమయ్యెనుగదా యని యుప్పొంగుచుంటిననియా, యీయాపదలఁగూర్పనెంచితివి?

ఓబ్రాహ్మణోత్తమా! ఆరామునికి మాఱుగనన్నువధియింపుము.

వ. మత్తకోకిల. చాలుఁజాలు ప్రల్లదంబుఁ జనగనెందుఁ బోయెదో
వల్లనౌనె నిల్వనీకు వాంఛలేల రామ! యా
విల్లుకాదు విఱువగాను వెఱ్ఱివగుచు తలచఁగన్
యుల్లసిల్ల జనునె యింక నోర్వుఁజూపు రఘువరా!

రా—అట్లైనఁ గాచుకొనుఁడు.

ప—ముందుగ దీనిని సాధించుము పిమ్మటఁ దలపడవచ్చును.

రా—అదియే గ్రైకొనిమెద నిటు తెండు.

(అని కోదండమునుగ్రైకొనుచు నాతనియందున్న
తేజస్సునుగూడఁ గ్రైకొనును.)

(దూరమున)

వ—దశరథా! చూచితివా పరశురామునుండి తేజస్సు రామునందుఁ
ప్రవేశించినది.

గీ. ఇంతతోఁ దీరె నాతని కంతబలము
సందియంబేల యింకను సరగుననిక
రాముఁడే గెల్చియాతని రణమునందుఁ
దూలఁజేయుటనిక్కము మూలమిదియె.

ద—అగునదిగో పరశురాముఁడు నిస్సత్త్వతో రాముని నేమియో
ప్రార్థించుచున్నాడు కంటిరా?

వ—ఏనుదొలుఁతనే శ్రీరాముఁ డసమానధీరుఁడనియు, నాతని కీ
లోకంబుననడ్డిపోరనిల్చువా రన్యులు లేరనియు నొక్కి పల్కి
యుండ లేదా? అయినదానినించుకయు లెక్కింపక మునుపటి
రీతినే పరశురామునిచే రాముఁడోడింపఁ బడునని, యెంతయు
భీతినొందితివి.

ద—మొదటఁ దామ పల్కిన ప్రగల్భములన్నియు నేమాయెనో.
ఎట్లు ఖిన్నవదనుండై యుండెనో.

(రాముఁడు బాణమును సంధించి)

విశ్వామిత్రా! నా బాణము నమోఘము. ఉపసంహరింపరానిది. బ్రాహ్మణుని వధించుట మహాపాతకము కాన, మీ పాదములఁ గొట్టెదను.

ప—రామచంద్రా! నీ మహిమ నిప్పటికి గ్రహింపఁ జాలితిని. మహాత్మా! నీవు నిక్కముగ నవతార పురుషుఁడవు కాని సామాన్యపు నరుఁడవు కావు. తెలియకచేసిన నా తప్పిదమును సైఁపుము. నా పాదంబులేల దునిమెదవు?

రా—మఱి దేనిని నీకాహారంబుగ నొసంగెదను?

ప—రామా!

గీ. తొల్లి నే జేసి యున్నట్టి యుగ్రతపము
వలనఁ గల్గినఫలితంబు బాపుమనఘ
దయను జూపుము రాఘవా! దర్పమణఁగె
గావుమో రామ! భక్తియుంతు గములనయన!

అందుచే నాకట్టి నష్టము గలుగకుండును ఇప్పుడేపోయి యింతటినుండియు మరల నెప్పటి యట్టుల తపమాచరించుచు, మునినై చరించెదను. కావున నట్లు చేయ వేడెదను.

రా—అయ్యా! ఇందుచే నింతదనుక నున్న పుణ్యలోకంబులు నశించె.

(అని బాణమును విడుచుచున్నాఁడు)

ప.—రాఘవా! శంవుగ్గైకొనిపోయెద. బుద్ధిమాంద్యంబున నాచరించిన నా దుష్టప్రవర్తనము మనసెంచక, కృపఁగొనుండుము.

రా—(వందన మాచరించి) చిత్తము.

ప—ఎల్లవేళల మనోభీష్టంబుల నెఱవేరుచు సంతసంబుననే నోలలాడుచుందువుగాక!

ప్రక్కను గాంచుడు పతితపావనయున
నొప్పుచుండెడుసీత యుర్వీనాథుఁ
డై జనకునికి నానఁగొల్పెడిపుత్రి
వర్ణింపవశమౌనె వనితరూపు
దాంపత్యమనని దే ధన్యులమైతిమి
కనులారఁదిలకించి కమలనయనుఁ
గీ. ఆదిదేవుఁడె రాముఁడు యతివలార!
సీతయే యాదిలక్ష్మియై చేరసతని
విరిఁగన్నట్టితల్లుల విపులసుఖము
వర్ణనాతీతమైయొప్పు వసుధనెప్డు.

రేం—రాముఁడొక్కఁడే కాదు. లక్ష్మణభరతశత్రుఘ్నులు కూడఁ బెండ్లికొడుకులైనారు.

మూ—అవునమ్మా! ఇదేమిచిత్రము వీరిచ్చటనుండి బయలుదేఱు నప్పుడు రామునికొక్కనికే పరిణయమనివింటిమి. తలవని తలంపులన నిట్లేయుండును. పుణ్యమూర్తులగువారికిఁ గొఱంత లేమియుండును. తలఁచినంతనే యన్నియు సానుకూలమగును.

నా—లక్ష్మణభరతశత్రుఘ్నులకు, నూర్మిళ, మాండవి, శ్రుతకీర్తుల నిచ్చి, నల్వురకొకమాఱే పరిణయములాచరించిరట.

కా—ఆ బాలలెల్లు వదనములసిగ్గుచే దాచుకొనుచుండిరో చూడుడు

—: అంతఃపురము :—

(ప్రవేశము:- రాముఁడు, సీత.)

రా—దేవీ! చిన్ననాటనే నీ వా వింటి నెత్తియుంటివఁట కాదా?

సీత—నాథా! అవన్నియు నిప్పు డెందులకు?

రా—ఏమనను దాని నత్తు(జాలకయున్న నిప్పుడే నెంత ఖిన్నవదనుండనై యుండవలసియుండునో కదా—

సీ—భవదీయపరాక్రమమును వెల్లడించునప్పు డేను గాంతాజనంబుతోఁ గలిసి, యంతఃపురమునుండి వీక్షించుచుంటిని.

రా—అపజయమేయైనఁ జప్పట్లఁజరచి, హేళనగావించి యుందువనుట నిక్కము.

సీ—(దరహాసితవదనమున) అట్టిసనేమి జరిగియుండునో, యిప్పుడెట్లనుకుందువా?

రా—కాంతా! మనకీసంఘటనఁ గూర్చిన మహానుభావుఁడా విశ్వామిత్రుఁడు సుమా—

సీ—తొలుత భగవత్సంకల్పము. పిమ్మట నాతని సహాయము.

రా—నిక్కమే. ధాతాజ్ఞలేక యేదియును నెఱవేర్పవలనుపడమికదా

సీ—ప్రాణేశ్వరా!

సీ. ఎట్టిపుణ్యంబుల నిట్టిభాగ్యము గల్గె
నో కద, ప్రాణేశ యుర్వి మిమ్ముఁ
జేఁబట్టి సతతము చింత లేమియు లేక
చరియించు సౌఖ్యంబు సంఘటిల్లె
పాదపద్మము లెప్డు బట్టి సేవించెడు
ధన్యతనొందియు దనరఁగల్గె
సతతంబుని నామ స్మరణంబుఁగావించి
నెగడొందనయ్యెను నీరజాక్ష.

గీ. నన్నుఁబోలెడు వనితల నెన్నఁగలరె
సకలసౌభాగ్యగరిమంబు సానుభూతి
ననుభవింపగఁ జెల్లె ననవరతంబు
పంకజాక్షుని కంటిని భర్త కాగ.

రా—తన్వీ! ఉద్యానవన విహారార్థము పోదమురమ్ము.

సీ—చిత్తము.

(అనినిష్క్రమింతురు.)

సంపూర్ణము.



సుప్రసిద్ధఆయుర్వేద వైద్యగ్రంథములు గ్రంథకర్త శ్రీమదశేష ర తిరుమళమాడభూషి శ్రీనివాసాచార్యులు అయ్యవార్లుంగారు వీరి రచియించబడిన వైద్యబుక్కులు అయిదున్ను మాచేశాశ్వతకాపీరైటుహక్కు పొందబడిఅచ్చుపడినవి యితర్లు యిమిటేషను గ్రంథములు యుచున్నారు గ్రంథకర్తగారిఫొటోను పేరున్ను చూచి మరితీసుకొనుడు:

1 ఆయుర్వేదసారసంగ్రహము(లేక)హిందూగృహ సంరక్షిణి 0—12—0 (మూడవకూర్పు) యీగ్రంథము ప్రతియింటనుండతగినది ప్రతిరోగమును స్వయముగా చూచుకుని వైద్యునియొక్క సహాయము లేకనే కుదుర్చుకొనవచ్చును.

2 సుఖరోగచికిత్సారత్నాకరము(నాలుగవకూర్పు). అ 12 యిందు అనేకరకముల సుఖరోగములకు వివరముగా వ్రాయబడినవి సర్టిఫికేట్లు వ్రాయుచున్నారు 3000 బుక్కులుఖర్చుపడినవి దీనియొక్క విషయము మేముచెప్పనక్కరలేదు.

3 శతలేహ్యపాకప్రకాశిక (మూడవకూర్పు). 0—12— నూరు లేహ్యములు చేయువిధము అందరికి తెలియులాగున వ్రాయబడినవి

4 నాడీపరిజ్ఞానము (మూడవకూర్పు) 0—8—0 నాడీనిదానము విపులముగా ప్రతివారికి తెలియులాగున వ్రాయబడినది అతిసులువుగా నాడీనిదానము తెలియగలదు.

5 పానీయకల్పవల్లి (మూడవకూర్పు) 0—4—0 యిందుషర్బత్తులు చేయువిధము తెలుపబడినది యింకనాటకములు నవలలు, వైద్యగ్రంథములు యితరగ్రంథములు వలయువారు యిక్రిందవిలాసమునకు వ్రాయుడు.

వంటెద్దు లక్ష్మయ్య బుక్కుసెల్లరు
రాజమండ్రి గోదావరిజిల్లా

# హబీబుల్లా ఆయుర్వేద యూనాని వైద్యశాల

రాజమండ్రి

## బృంగామలక తైలము

ఈ తైలమును తలకు నిత్యము వాడుకొనుచుండిన తలనొప్పి, పార్శ్వపు నొప్పి, తలబరువు, తిమ్మిరి, మెడకొంకులకు పై భాగమునందు జనించు వ్యాధులు, తలతిరుగుట. చెవులయందుధ్వని, చెవులయందుదురద, కండ్లుమంట, కండ్లుమెరుపు, కండ్లనీరు కారుట, కండ్లమసక, పుసికట్టుట, వెలుగుచూడజాలకపోవుట మొదలగువ్యాధులను పోగొట్టును శాస్త్రోక్తముగా తయారుచేయబడినది. ఒకసారివాడిన తమకేవిశదపడగలదు. దీని వెల సీసా 1కి 0—12—0.

## చందనామలక తైలము

ఈ తైలము మంచివాసనగ నుండును. మెదడునకు చలువచేయును. నేత్రములు, కర్ణములు, నాశికము, కంఠమునకు మేలుచేయును. విశేషజ్ఞాపకశక్తి చురుకైనబుద్ధి మన్మథునితోసమానముగు ముఖకాంతి కామవృద్ధిని కలిగించును తలయందుచుండ్రు పేనుకొరుకు వెంట్రుకలు వూడిపోవుట వెంట్రుకలుతెల్లబడుట మొదలైనవ్యాధులను రూపుమాపును. విద్యార్థులు రాత్రికాలమునందు నిద్రమేలుకొనువారు దీర్ఘాలోచనగలవారలకు మిక్కిలిఉపయుక్తము యిందుబజారు నూనెలవలె సెంటుగాని యెసెన్సుగాని రంగులుగాని చేర్చియుండలేదు ఆయుర్వేదపద్ధతిని తయారుచేయబడినది. ఒకపరియాయము తెప్పించి వాడి చూడుడు. దీని వెల సీసా 1కి రూ 1—4—0.

ఇవికాక మాయొద్ద ఆయుర్వేదయూనానీ ఔషధసామానులు మూలికలు కిరానాసామానులు ఔషధములు కస్తూరి కుంకుమపువ్వు గోరోచనము. మొదలగుయావత్తుసామానులు వగైరాలు సరసమైనధరలకు దొరకును.

ఇట్లు

మేనేజరు

వైద్యభూషణ. డి. రహంతుల్లాబేగ్ సాహెబ్

